# మధుసేవ




చింతామణీ చిత్రాభ్యుదయాది గ్రంథకర్త

మహాకవి

## కాళ్లకూరి నారాయణరాయ

ప్రణీతము.

మొదటికూర్పు 2000 ప్రతులు.



కాకినాడ

సిటీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926

 వెల 1 రు. 

# అవతారిక

మన దేశమున కిప్పుడు మద్యపానము మహాశత్రు వై యున్నది! ఈ దుర్వ్యసనమునకు లోనైనవా రీదేశమున నిప్పుడు రెండుకోట్లకు పైన నుండక పోరు !. బ్రాందీ విస్కీలవారి యొక్క దుర్వ్యయమును, కల్లుసారాలవారి తక్కువవ్యయమును గలిపి, తలకు దినమున కెనిమిది యణాలవంతునఁ జూచినను- రెండుకోట్లమీఁదను దినమున కొక గోటిరూప్యములు దగ్ధ మగుచున్నట్లు తేలుచున్నది. అనఁగా: సంవత్సరమునకు మూఁడువందల యఱువది యైదుకోట్లన్నమాట ! అనఁగా: మన దేశముపై దొరతనమువారికి వచ్చు నాదాయమునకు రెండురెట్లధిక మన్నమాట ! ఈ దుర్వ్యసనము హరించి, యీ సొమ్ము మిగిలించో-మన దేశము మహదైశ్వర్యముతోఁ దులఁదూఁగదా! ఇప్పటి నేరములు-ఇప్పటిహత్యలు-ఇప్పటి కోట్లాటలు-ఇట్టే రూపుమాయవా ! ఇంతకన్న స్వరాజ్య మింక నేమున్నది ! కాఁబట్టి, యీ ప్రబలశత్రువును భస్మీకరించుటకై ప్రయత్నింపవలసిన బాధ్యత ప్రతి భారతీయునియందును గలదు. ఈ రూపముగా నా బాధ్యతను నిర్వర్తించుకొను తలంపుతో నే నీ రూపకమును వ్రాసినాఁడను. ఫలితము భగవదాధీనము !

పాత్రౌచిత్యముకొఱకును, పామరజన సుబోధముకొఱకును గావించిన భాషాసాంకర్యములనేమి- ప్రమాదములనేమి- పండితులు మన్నింపఁ గల రని భావించుచున్నాఁడను. గ్రంథమును గడతేఱఁ జూడకయె, గ్రంథకర్త యుద్దేశమును గూర్చి కాసింతయేని యోజింపకయె, సవరణముల నుపపాదించు సాహసికులను-కలములను కాగితములను బాడుసేయ వల దని కడుంగడుఁ బ్రార్థించుచున్నాఁడను.

కాకినాడ
1_5_26.

మహాకవి
కాళ్లకూరి నారాయణరావు.

A perfect judge will read each work of wit
With the same spirit that its author writ.

# ఇందలి పాత్రములు

1 రఘు- రఘునాథరావుగారు—కథానాయకుఁడు.

2 విశ్వా- విశ్వాసరావు—రఘునాథరావుగారి మేనేజరు.

3 శర్మ- రఘునాథరావుగారి దుష్టస్నేహితుఁడు.

4 నిర్మ- నిర్మల—రఘునాథరావుగారి భార్య.

5 కస్తూ- కస్తూరి—వేశ్య.

6 చిన్న- సిపాయి చిన్నయ్య—రఘునాథరావుగారి నవుకరు.

7 రంగ- రంగఁడు—ఒక త్రాగుబోతు.

8 వెంక- వెంకటేశము—కస్తూరి తమ్ముఁడు.

9 కాసిం- కాసింసాహేబు—కస్తూరి రహస్య విటుఁడు.

10 ఇన—ఇనస్పెక్టరు.

11 మేజి—మేజిస్ట్రీటు.

12 ప్రాసి—ప్రాసిక్యూటరు.

13 పంతు- పంతులు—రఘునాథరావుగారి వకీలు.

14 నాయు- నాయుఁడు—కస్తూరీ శర్మల బారిష్టరు.

---

## ప్రకటన

లిఖితరూపకమగు నాయనుమతిని పొందనివారు

### ఈ నాటకమును ప్రదర్శింపఁగూడదు

గ్రంథకర్త

శ్రీ

మేధా దక్షిణామూర్తి పరబ్రహ్మణే నమః.




## నాంది

గౌరవ మాయువుం సిరి సు ♦ ఖంబును దెల్వియు రూపడంచి, పై
వారికి హేయబుద్ధి, తమ ♦ వారికి వ్యాకులమ్ముం ఘటించి, ని
స్సారులం జేయు దుర్వ్యసన ♦ సంతతి పాల్పడకుండ మా సభా
స్తారుల నీశ్వరుండు సత ♦ తంబును సత్కృపం గాచుం గావుతన్!

## ప్రస్తావన

సూత్ర—(ప్రవేశించి) ఓహో! నేటిసభ నేత్రపర్వముగా నున్నదే!

సీ. తక్కువతరగతి ♦ టిక్కెట్లు కొని, మీంది
చోటుల కేగి కూ ♦ ర్చుండువారు
క్షణము జాగైనచోం ♦ జప్పట్లు చఱచుచుం
గెవ్వున నూలలు ♦ రువ్వువారు
ఇంచుకంత ప్రమాద ♦ మెందేని వాటిల్ల
గొబ్బున లేచిడీక ♦ గొట్టువారు
సమయాసమయముల ♦ సంగతి లేకుండ
వన్స్‌మోరని బిట్టు ♦ వదరువారుం
గాక—కోవిదులును, గుణ ♦ గ్రహణపరు, లు
దారమానసులును, సావ ♦ ధానమతులు
నైనప్రముఖులె విచ్చేయు ♦ నట్టిభాగ్య
మబ్బినది నేండి దేశ ♦ పుణ్యంబొ కాని!

(పరిక్రమించి, చేతులు మోడ్చి) ఓ సభాస్తారులారా!

సీ. పసితనమందె పా ♦ వన వర్తనమునందు
బాగుగ నలవాటు ♦ పడినవాండు

బట్టకొల్లలకుఁ, జుట్టుకొల్లలకు ♦ గ్రాంథకొల్లలకు
సిరులు పరదేశములపాలు ♦ సేయువారుఁ
బూర్తిగా నెల్లెడల నట్టి ♦ పోవుదనుక
దేశమున కీ యరిష్టము ♦ తీఱఁ బోదు !

(ఉలికిపడి) ఏమి చెపుమా యీ గోల ! (అని లేచి గవాక్షము గుండ వీథివంకఁ జూచి) ఎవనినో తప్పఁద్రాగిన దౌర్భాగ్యుని దండభటులు - చచ్చిన గేదెదూడను బలెఁ జరచర నీడ్చుకొనిపోవుచుండ - సోమరులు కొందరు చోద్యముఁ గిందఁ జూచుచు వానిని వెంబడించినారు ! సిగముడి వీడ, సింగారించిన ఫుట్ట మూడ - ఒడ్డునఁ బడ్డ చేఁపవలె, ఓడ దిగిన నావికునివలె - తేపతేపకుఁ దెయితక్క-లాడుచు - అనువు తప్పిన యవయవములతో, అలుకుపాఁతలైన యుడుపులతో; పెంట లూడ్చిన తలతో, పెచ్చు లూడిన యొడలితో - మద్యపానమువల్ల నీమందభాగ్యుఁ డేమి యానంద మనుభవించుచున్నాఁడో !

[illegible]లములు గ్రోలి కుంజరము ♦ సర్వసమృద్ధి మెలంగ నేర్చు, నా
[illegible]లములె త్రావి సింహ మతి ♦ శౌర్య బల ప్రతిభ స్థితి [illegible]
వశ ఘన కుంభయుగ్మమును ♦ వ్రస్సలు సేయును; వీని నాత్మలోఁ
దలఁపక, మానవుండు సురఁ ♦ ద్రావఁగఁ గోరు ని దేమి వెఱ్ఱియో!

చిన్నయ్య—(ప్రవేశించి) బాబూ! రంగఁడీపూట కొంచెం రమ్ముసీళ్లు బద్దకెంచి, పెళ్లాన్ని కొట్టబోతే - ఆదెబ్బ, అడ్డఁవెళ్లిన అత్తగారికి తగిలిందంటండి - అందుకోసం పోలీసువా రాయెదవను టేశను కీడ్చుకుపోతున్నా రంటండి- యేల్నివారితో యీసంగతి చెప్పమని ఆడిపెళ్లాఁ వొచ్చి అగోరిస్తోందండి.

రఘు—ఏమీ - యిప్పుడు పోలీసువాఁచే నీడ్చుకొనిపోఁబడుచున్నవాఁడు రంగఁడా ! ఇటువంటి విషయములలో మా నవుకర్లకు మేము సాయపడువారము కా మని చెప్పినాము !

చిన్న—చిత్తం బాబూ ! చిత్తం. ఇదే మా పటాలంలో అయితే

యీపాటికి చీకటికొట్లో యేశారన్నమాటే. తెల్లోడు తాను తాగడంవే కాని- యెదటివాడు తాగడాని కెన్నడూ వొప్పుకోడు.

రఘు—సరే- నీసోదె చాలుఁ గాని - వీలుగా నన్నయెడల నొకసారి పయికి రమ్మన్నా నని విశ్వాసరావుగారితోఁ జెప్పి - క్రొత్తగుఱ్ఱమునకు జీను కట్టి కొనితెమ్మని గుఱ్ఱపువానికి వర్తమాన మంపుము.

చిన్న—చిత్తం బాబూ! చిత్తం. (అని నిష్క్రమించును.)

విశ్వా—(ప్రవేశించును)

రఘు—మామగారూ! రంగని సంగతి విన్నారా?

విశ్వా—విన్నాను బాబూ!-విన్నాను.

రఘు—తోడనే వీనిని కొలువునుండి తొలఁగించుట మంచిది కాదా?

విశ్వా—మంచిదే కాని - యొకసారి మందలించి చూతము.

రఘు—ఏమి వెఱ్ఱి! గుగ్గిళ్లు పెట్టిన గూనివంపు తీఱునా?

ఆ. దూదిబుంగ నరుఁడు, • దుర్వ్యసనంబులు
నివురు లేని చింత • నిప్పు రవలు;
స్వర్గమునకు దారి • సంఘటిల్లిన నంతు
చూ..డ నీడ • నాదు కేడ!

ఆపయిని—

గీ. అంటురోగంబులకును, దు • ర్వ్యసనములకు
లేదు పరికింప భేదము • లేశమేని;
దరికి రానిత్తు మేనిఁత • థ్యముగ ప్లేగు
పోలిక, క్షణంబులోఁ జుట్టు • ముట్టి తీఱు!

విశ్వా—నిజమే నిజమే. కావుననే, దుర్వ్యసనములకును మనకును దూర మెంతయున్న నంతమంచి దని పెద్దలు చెప్పుదురు. తమ సెలవుప్రకార మీరంగని తత్క్షణమే తొలఁగించెదను.

రఘు—(నవ్వుచు) సరి కాని, మామగారు! సాహసించి యడుగు చున్నాను- మీ కేమియు దుర్వ్యసనములు లేవు కద?

విశ్వా—ఈశ్వరానుగ్రహమువల్ల నింతవఱకు లేవు!

రఘు—ముక్కును ముటుగుతూ ♦ ముగం జేసి, దేవుని
తిన్నెపై నైన చీ ♦ దంచితీఱు !

విశ్వా—దేవుని తిన్నెమీందనే కాదు—దేవుని తలపైంగూడ నాయూటతో నప్పుడప్పు డభిషేకము జరుగుచునే యుండును!

రఘు—ఊటమడికలతో మేని ♦ యుడుపులెల్ల
సించి, చాకలిచేత ది ♦ ట్టించితీఱు !

విశ్వా—చాకలిచేతనే గాదు—వాకలియూడ్చు దాసీదానిచేం గూడ చావుతిట్లు తినవలసినదే!

రఘు—పలుకులకు లేల-వెలయాలు ♦ పగిది-నెత్తి
నెక్కు, కజ్జ కండలు చేసి ♦ కచ్చితీఱు !

విశ్వా—నిజమే బాబూ!— నిజమే! ఇదుగో - నా పొఱుము బుఱ్ఱ నిప్పుడే పప్పుక్రింద బ్రద్దలుకొట్టెద! (అని యట్లు చేయును).

రఘు—సెబాసు! నాజన్మ మిప్పుడు చరితార్థమైనది! ఏమా?

గీ. ఏటవాలుగం బాఱెడి ♦ యేటి నుండి;
వ్రణమువలె సల్పు అలముంపు ♦ ఋణమునుండి,
నాటుకొనినట్టి దుర్వ్యస ♦ నములనుండి—
యొకనిం గాపాడినను జన్మ ♦ మొప్పు నంద్రు.

చిన్న—(ప్రవేశించి) బాబూ! గుఱ్ఱం వొచ్చిం దండీ.

రఘు—మామగారు! నే నొకసారి మనతోటవఱకుం బోయి వచ్చెద. ఈపూంట వచ్చిన యుత్తరము లివిగో యిచ్చట నున్నవి. (అని బల్లమీంది యుత్తరములు చూపి, బట్టలు వేసికొని, చిన్నయ్యతో నిష్క్రమించును).

విశ్వా—(ఉత్తరములం దీసికొనుచు) ఔరా - అబ్బాయిగారి యోగ్యత! ప్రభువు లందఱు నిట్టివారైనచోం బ్రజలభాగ్య మెట్లుండెడిదో గదా!

సీ. కోష్టులతో, గొట్టుపా ♦ ట్లుట్లతో, సేమ ధుం
దెబ్బలచేం గొలువులు ♦ తీఱునారు !

వేలును లక్షలు • వెచ్చించి, కుక్కలఁ
గొని మూతి నాకించు • కొనెడివారు !
ఇంటిదాసీలకు • బంటులై, భార్యల
మోము లన్న మొగాలు • ముడుచువారు !
పాడువేసాలకై, • బ్రాంది సీసాలకై
యెన్నేట్లనే విక్ర • యించువారు !
నై, జమీందారు లెందఱో • నైజకీర్తి
గింగలోఁ గల్పుచున్న యి • క్కాలమందు--
భాగ్యవశమునఁ గాక, యి • ప్పగిది పరమ
పావనుండైన ప్రభువు సం • ప్రాప్త మగునె !

చిన్న—(వడిగాఁ బ్రవేశించి) అయ్యో ! అయ్యో !- రండి!- రండి !- పాముగుట్టం బెదిరి బాబుగార్ని పడదోసిం దంట !

విశ్వా—(ఉలికిపడి) అరెరె ! యెంతపని జరిగినది ! అబ్బాయిగారి కేమియు దెబ్బ తగుల లేదు గద?

చిన్న—అమ్మయ్యో ! అంతగుట్టంమీదనుంచి పడితే దెబ్బే తగల్దా! తల పగిలిం దంట- తరువేసి ఆసుపత్రికి తీసుకుపోతున్నా రంట ! పోలీసువారు జామీను తీసుకు పొమ్మంటే- ఆసఁపయానికి రంగ డెల్లాగో ఆదా ర్కొస్తున్నా డంట- పాపం, బాబుగార్ని వాడే పట్టి లేవనెత్తా డంట !

విశ్వా—(ఆందోళనముతో) అన్నన్నా ! యెంతప్రమాద మెంత ప్రమాదము ! దైవమా ! నీ వింత దారుణమున కొడిగట్టితి వేమి!

ఆ. సకల సుగుణ రాశి • శాంత పయోరాశి
వినయ భరితుఁ, డతి వి • వేక కలితుఁ;
డట్టివాని కట్టి • యాపద కలిగింప
బుద్ధి యెట్లు నీకుఁ • బుట్టె నయ్యా !

(అనుచు సత్వరముగా నిష్క్రమించును).

ఇది ప్రథమాంకము.

రాజును పట్టుకున్న దేవుడు?- మేంవు కాదూ! అప్పుడేగా ఆకాశాన్నుంచి సుచ్కలు రాలాయి! మాపటాలం వెళ్లకపోతే మాండలికోట దొరికేదా! ఆరాజు సింవాసనాన్ని ఆరువొందల వజ్జిరాలున్నాయి! కోటలో యెటుతిరిగినా- కోడిగుడ్డంతేసి రత్తనాలు కాళ్లకు తగిలేవి!

రంగ—రత్తనాలేనా- రమ్ముసారా యేంవైనా వుండేదా?

చిన్న—ర మ్మింకా రాతేదన్నాగా?- ఇష్టంవొచ్చినంత యిప్పసారా పట్టసారా దొరికాయి.

రంగ—అయితే నువ్వు సేనాసారాలు సూశావన్నమాట!

చిన్న—సూశాను గానీ- సాంవుమంతరం నేర్చుకున్నాక, పతిరిసేవ మొదిలెట్టి- కల్లు సారాలు కంట సూట్టం మానేశాను.

రంగ—సరేగానీ- బాబుగా రెల్లా వున్నారు?

చిన్న—బాబుగారు బంగారంలా గున్నారు. అన్నట్టు సెప్పలేదు- బాబుగారు పడ్డప్పుడు నువ్వు సేసిన సేవకు, బగుమతీ యివ్వడానికి పిలమంటే- నువ్వు రంగం వెళ్లినట్టు నేనే సెప్పాను. అప్పట్లో నివ్వొంటే అడిగిన యీనాం యిచ్చేవారు. నిజంగా బాబుగా రప్పుడు నీమూలాన్ని బతికారు!

రంగ—తప్పు తప్పు! నామూలాన్ని కాదు- నంవయానికి నా సేతులో వున్న సారాసుక్క మూలాన్ని బతికారు! ఆ పడ్డపాటుకు ఆ సుక్క పడకపోతే- ఆపాట్న గుటుక్కు మనవలసిందే!

చిన్న—అయితే బాబూ!- అయ్యగార్ని కాడికి తెచ్చించి నీసేతి బోణీయేనా!

రంగ—అదేం టదేంటి?- ఏకాడికి తెచ్చిం దేంటి?

చిన్న—ఏకాడికా- (మెల్లంగా) తాగినోడంటే తరంవే శేకాణ్ణుంచి- తాగుమోతుల్ని సూట్టూ కూకుండబెట్టుకుని, తప్పతాగేకాడికి! కాంవోసినంత సొమ్ముతో కలకల్లాడేకాణ్ణుంచి- అరవ య్యేల్లాకా అప్పుసేసే కాడికి! ఈపాలి తెలిసిందా?

ఖి యని తెలిపి- బాధానివృత్తి యగువఱకును బ్రాందిసేవ తప్ప దని చెప్పెను! ఇఁకఁ జేయవలసిన దేమున్నది?-

చ. పదిలముగా గవాటమును ♦ వైచి, యొకండనె కూరుచుండి యీ
గది నొకకొన్నినాళ్లు- నిటఁ ♦ గాదని మా వనవాటి కేగి పూ
పొదలను గొన్నినాళ్లు-నిరు ♦ పూఁటల మందుగఁ గ్రోలి క్రోలి, హా!
తుద కిటు రేపు మాపులును ♦ దుష్టిగఁ ద్రాగుడుదాఁక వచ్చితిన్!

శర్మ—ఇఁకఁ జెప్పనక్కఱ లేదు. ప్రపంచమునందలి పైతరగతి త్రాగుబోతులలో-వందకుఁ దొంబదిమంది వైద్యులవల్ల వక్రించినవారే!

గీ. తథ్యము వచింతు- మద్యసుం ♦ దరికిఁ గన్న
తండ్రి వైద్యుఁడు; వెలయాలు ♦ తల్లి; వైష్ణ
వుఁడు చెలికాఁడు; తద్వర్త ♦ కుండు దూత;
జారులుం, జోదులు, నిశా ♦ చరులు, మంత్ర
వాదులుం, జూదరులు, నటుల్ ♦ వలపు మగలు!

రఘు—అయినను, నే నాయన చెప్పఁగానే మెత్తఁబడ లేదు. అనేక సాధనములు చేసి చూచినాను. కాని, దానితోఁ గాని తలపోటు తగ్గెడిదే కాదు! చివర కొకసంవత్సరమున కాశిరోవేదన పోయినది. అయిన నేమి- అప్పటికె యది వెన్నెముకవఱకును వేరుతన్నినది!

శర్మ—(తనలో) కనుకనే, మావంటివాండ్ర కింత గ్రాసము దొరకు చున్నది! (పయికి) అయిన, నందులకు మీ రన్యథా భావింప నవసరము లేదు.

* ఏ లిటిల్ విస్కీ, నౌ అండ్ దెన్,
యీజ్ రెలిష్డు బై దీ బెస్టు ఆఫ్ మెన్.

అని కారికలే యున్నవి. అవి కాక- మీరు గుఱ్ఱముమీఁది నుండి పడినప్పుడు మీ సేవకుఁడు పోసిన చుక్కలే మీ ప్రాణములను నిలిపినవి. కాకున్నఁ దోడనే కాళ్లుఁ జేతులుఁ జల్లఁబడెడివి. మద్యముయొక్క మహిమకు మేరయున్నదా!

* A little whiksy, now and then, Is relished by the best of men.

సీ. కనుగందువాఁ డొక ♦ గ్లాసు వేసినతోనె
హనుమంతునకు గంతు ♦ లాటనేర్పు
మూఁగవాఁ డొక్క డ్రా ♦ మందొన్న మాత్రాన
వేనోళ్ల శేషుని ♦ వెక్కరించు
పిఱికివాఁ డొక యౌన్సు ♦ పీల్చిన యంతనె
యుత్తరు చెంపపై ♦ నూచి కొట్టు
పుంస్త్వహీనుం డొక ♦ పుడిసెడు గొనంగానె
సింహబలుం బట్టి ♦ చిత్తు చేయు
పరమలోభి యొక్క ♦ పాత్రెడు సేవింప
దానకర్ణుఁ దరిమి ♦ తరిమి కొట్టు
శోకభరితుఁ డొక్క ♦ సోలెడు గ్రోలిన
నొడలు మఱచి హర్ష ♦ జలధి మునుఁగు !

రఘు—(నవ్వి) ఇదిగో- యీ నీ ధోరణియే యిందులకు నిదర్శనము!

శర్మ—నామాటలు మీ రట్లు నవ్వులఁ బుచ్చఁదగినవి కావు. జగత్ప్రఖ్యాతి వడసిన- షేక్స్పియర్ త్రాగుబోతు, షెరిడన్ త్రాగుబోతు; విల్సన్ త్రాగుబోతు, నెల్సన్ త్రాగుబోతు; మనలో- వ్యాసుఁడు త్రాగుబోతు, వాల్మీకి త్రాగుబోతు; కాళిదాసు త్రాగుబోతు, కబీరుదాసు త్రాగుబోతు; ముప్పదిమూడుకోట్ల దేవతలు త్రాగుబోతులు, మును లందఱు త్రాగుబోతులు. ఇప్పటి నాగరిక ప్రపంచములో త్రాగనివానికి తావే లేదు! త్రాగినవాఁడే యూరికి తలమానికము- త్రాగినవాఁడే నలుగురిలో తగవరి! త్రాగినవానికే యూరిలో దాక్షిణ్యము- త్రాగినవానికే యింటిలో ధర్మపిండము! త్రాగినవానికే సభలో తాంబూలము- త్రాగినవానికే మేజువాణీలో దండము! ప్రభువు త్రాగక పాలింపలేఁడు- సేవకుఁడు త్రాగక సేవింపలేఁడు! వకీలు త్రాగక వాక్కు మెదపలేఁడు- వైద్యుఁడు త్రాగక వ్యాధిని గనిపెట్టలేఁడు! కవి త్రాగక కలము పట్టలేఁడు- గాయకుఁడు త్రాగక కిఁచె మొత్త

లేదు ! పూజారి త్రాగక పులికాపు పెట్టలేడు- అర్చకుడు త్రాగక హారతి పట్టలేడు ! వంటవాడు త్రాగక వండలేడు- వడ్డన వాడు త్రాగక వడ్డింపలేడు! పెండ్లిలో త్రాగుడు, పేరంటములో త్రాగుడు; విందులో త్రాగుడు, వీడుకోలుపులో త్రాగుడు; క్లబ్బులో త్రాగుడు, గ్రంథకుటిలో త్రాగుడు; రచ్చలో త్రాగుడు, గెలుపులో త్రాగుడు; భోగములో త్రాగుడు, రోగములో త్రాగుడు; చావులో త్రాగుడు, శ్రాద్ధములో త్రాగుడు ! ఈవిధముగా త్రాగుడు: ఇష్టదైవమువలె నిహ పర సాధనమై- పసుగు పేకల వలె ప్రపంచమంతయు నిండి- గాలి వెలుగులవలె గౌరవాదరము లను బడసినది, పడయుచున్నది, పడయ నున్నది !

రఘు—(పకపక నవ్వి) ఓరి నీ లెక్చరు కాల ! టెంపరెన్సు సొసైటీ వారి (Temperence Society) దుంప తెంపెదున ట్లున్నావే ! సరి కాని,యీదుర్వ్యసనేముున కిందఱు లోనగుటకుఁ గారణమేమి?

శర్మ—దాని మహిమయే దానికిఁ గారణము. ఆమహిమ కం తున్నదా!

సీ. బ్రాందిసీసా కంటఁ • బడఁగానె వరహాల
పాతు కాన్పించిన • పగిదిఁ దోఁచు !
తప్పు మంచును గార్కు • చప్పుడైనంతనె
జయభేరి విన్నంత • సంభ్రమొదవు !
దొడదొడ గ్లాసులోఁ • దొలికించు సమయాన
నమృతంబు పడుచున్న • యట్టు లుండు !
చుఱచుఱ గొంతులోఁ • జొచ్చెడు తఱి, పోయి
నట్టిప్రాణము వచ్చి • నట్టు లొప్పు !
అవల, నానందవార్ధి నో • లాడునట్లు
స్వర్గభూమి విహారము • సలుపునట్లు
రంభ యొడిలోన నిద్దుర • గ్రమ్మినట్లు
తన్మయావస్థలోనఁ జ • త్తము సుఖించు !

రఘు—అసహాయవాదులు దాని నంత మొందింపఁ జూచుచున్నారే.

శర్మ—అసహాయవాదులుం గారు సరిగదా- హరిహరాదులుం గూడ దాని నంత మొందింప లేరు! ఏ మందురా?- వారి గద్దుకొనఁగల మహానుభావులు వైస్రాయి సభలోఁగూడఁ గలరు! ఆ పైని- ఎలెక్షనులలో దాని కప్పు డెక్కడలేని ప్రాముఖ్యతయుఁ గలిగినది! విన్నారో లేదో- మొన్నటి మ్యూనిసిపల్ యెలెక్షను సందర్భమున- సారాకొట్లు, మ్యూనిసిపల్ కచేరీలమధ్య, వోటర్లు- తిరుపతిమొక్కుల బిచ్చగాండ్రవలె తీట తీఱ దొరలినారఁట! దీని కేమి గాని- క్లబ్బులో గానసభ యఁట- వెళ్లితిమా?

రఘు—చీట్లాట గుంపులతో మనక్లబ్బు- శివగంగ తిరునాళ్లను మించి యుండును గదా- ఆగందరగోళములో గానసభ కూడనా!

శర్మ—అసలు, మీకు, సంగీతమునందుఁ జవి కలదా?

రఘు—సంగీతమునందుఁ జవి లేకపోలేదు గాని-

చ. బిరడలు త్రిప్పి, తంత్రులను ♦ బెల్లున ద్రెంచి, ముఖము ఘటించి, తం
బుర శ్రుతి చేసి, గొంతుకప ♦ మ్ముగ సకిలింపుల నెట్టి, గూబ్బస్వ
కరము గదించి, వాతపోరి ♦ క్రిక్కిన చందమున న్వికార వై
ఖరి సభలోన గింజుకొను ♦ గాయకుఁ డెన్న నసహ్యమే జుమా!

శర్మ—అట్లయిన, మీ కాఁడుపాటపై నాదరము హెచ్చన్నమాట!

రఘు—ఆఁడుపాట యన్న జ్ఞప్తికి వచ్చినది- మొన్న రాత్రి యీవీథి నొక పెండ్లియూరేగింపు వెళ్లినది. ఆయూరేగింపు మేజువాణిలో నొకతె పాడినది గదా- ఆ స్వరమాధుర్యమే మని చెప్పుదును!

శర్మ—స్వరమాధుర్యమేనా- దాని సౌందర్యమాధుర్యము కూడఁ జిత్తగించినారా?

రఘు—అంతవఱకు జరుగుట కవకాశము లేకపోయినది.

శర్మ—(తనలో) సెబాసు! అవ్తైన ఆపర్చ్యూనిటీ (Opportunity) దొరకినది! ఈసందర్భములో నీతనికి మమతే కలిగించి, దాని యింటికిఁ దార్పఁగలిగితినా- నాయిష్టము నాలుగుకాళ్లమీఁద

నడచిన దన్నమాటే ! బహుకాలమునుండి దానిపై నాకుంగల భ్రమయుం దీఱును- ఈయెఱచేత నీతండు నాచేతి కీలుబొమ్మయు నగును ! ఏమి ఛాన్సు ! (Chance) టూ బర్డ్సు విత్ వన్ స్టోన్ ! (Two birds with one stone)

రఘు—ఏమిటి యాలోచించుచున్నావు ?

శర్మ—ఏమని చెప్పుదును ! దానియందము చూడలేదనంగానే నా డెందము క్రుంగిపోయినది !

రఘు—అదేమి ?

శర్మ—అదే మేమిటి ?— ఆ సౌందర్యరాశిని చూడనివి చూపులా !

రఘు—ఎవతె యా యువతి ?

శర్మ—దానితల్లి దానికి పెట్టినపేరు: కస్తూరి—దాని సౌందర్యమును బట్టి లోకులు పెట్టినపేరు సెర్చిలైట్ ! (Search light)

రఘు—ఆ కంఠస్వర మా కస్తూరిదే యని నీ వెట్లు చెప్పఁగలవు ?

శర్మ—ఆ సమయమున నేనుగూడ నా మేజువాణీలోనే యున్నాను. ఉండకపోయినను జెప్పఁగలను. అట్టికంఠస్వరము కల దీయూరిలో నదితప్ప యింకొకతె లేనే లేదు.

రఘు—(నవ్వుచు) అట్లయిన, నీ వీ యూరిలోని ఆటకత్తెల నందఱ నెఱుఁగుదు వన్నమాటయే !

శర్మ—ఎంతమాట ! అంతో యింతో చేయునది వైశ్యముకదా ?

రఘు—అట్లయిన, నీసారి యాసెర్చిలైటు టీవీథిని వచ్చినప్పుడు- ఎన్ని కాండిల్సు పవరు (Candles power) కలదో చూచెద లెమ్ము.

శర్మ—అట్లయిన మీ కా పవరు రేపే చూపఁగలను !

రఘు—అదెట్లు ?

శర్మ—ఎట్లా ?— మరల నొకసారి రవంత మధుసేవ చేసి మనవి చేసెదను. కాసింత మీరుకూడ కానిండు.

ఇద్దఱు—(గ్లాసులు నింపి నోటం బోసికొనుచుండఁగా— తెర పడును.)

ఇది ద్వితీయాంకము.




# తృతీయాంకము.

ప్రదేశము:—కస్తూరి యిల్లు.

ప్రవేశము:—కుర్చీపైఁ గూర్చుండి శర్మ, యెదుట నిలుచుండి కస్తూరి.

కస్తూ—పంతులుగారికి నామీఁద నేఁడు పరిపూర్ణకటాక్షము వచ్చినది!

శర్మ—ఇదిగో !- మొదలే నేను పుట్టెడు మొగమోటముతో వచ్చినాను! అట్టి పెద్దమాటలు విసిరి నన్నడలఁగొట్టకు!

కస్తూ—ఎంతమాట! తాయారుమీఁద మీకు తగనియిష్టమని వాడుక. అందుచేత నట్లన్నాను.

శర్మ—నిజమే కాని- నీచపుముండ నిలుపుకొనలేక పోయినది! కులమువానిని మఱగి కూటిలో మన్ను వేసికొన్నది!

కస్తూ—అయ్యయిన, దానియింటికి మీరు దయచేయుటలే దన్నమాట?

శర్మ—నీతోడు! నీతో నే నబద్ధ మాడుదునా? కులమువాఁడు పారలి వెళ్లిన ప్రక్కమీఁద- కుక్కినపేనువలెఁ గూలఁబడవలసి వచ్చినప్పు డా గుమ్మము త్రొక్కుటకంటెఁ గూడనిపని యున్నదా? ఒక్క తాయారే కాదు- ఇప్పు డెక్కడఁ జూచిన నిదే కర్మము! కులమువాఁడు ముందు- కిలమువాఁడు వెనుక!

సీ. సోమయాజులుగారి ♦ శోభనాంగికి, దాని
మద్దిలకాఁడె కా ♦ మాటు మగఁడు!
ఆచారిగారి సిం ♦ హాచలంబునకు గ
జ్జెల మోఁతగాఁడె కా ♦ వలపు మగఁడు!
పంతులుగారు చే ♦ పట్టిన యిందిరా
స్వరూ పిడేల్ కాఁడె కా ♦ చాటు మగఁడు!

నాయఁడుగారు ప్రా ♦ ణము పెట్టునట్టి ర
త్రికి తిత్రికాఁడె కా ♦ తేర మగఁడు !
పెద్దకోమటి సొమ్ముతోఁ ♦ బెరిగినట్టి
మురహరికి తాళగాఁడె కా ♦ ముద్దు మగఁడు !
ఇది యది యనంగ నేల యే ♦ యింటఁ గనిన
కులమువారలె విటులు సా ♦ నులకు నేఁడు !

కస్తూ—అదోష మెవ్వరి దని మీ యభిప్రాయము ?-

సీ. సుబ్బిసెట్టి తెనాలి ♦ సుందరి యింటను
పక్కలు వైచి, దీ ♦ పములు పెట్టు !
పొట్టిసంతులు, విరి ♦ బోణి మేళములకు
వెడలిన యూరెల్ల ♦ వెంబడించు !
కామశాస్త్రులు పూల ♦ కనికి కూఁతుండ్రకు
మగలఁ దెచ్చుటకు రే ♦ పగలుఁ దిరుగు !
స్వామినాయఁడు తన ♦ సాని నన్యుల కప్ప
గించి, తా వీధివా ♦ కిటఁ బరుండు !
కొండమీఁద నున్న ♦ కోఁతి కావలె నన్నఁ
జచ్చి యైనఁ దెచ్చి ♦ యిచ్చువారె
పాడుపనుల కిట్లు ♦ పాల్పడుచుండంగ
సానిముండ లేమి ♦ సలుపకుండ్రు ?

శర్మ—ఎట్లయిన నేమి- ఎక్కడనో నీవంటిది తప్ప- యేయింటఁ జూచినను, కులమువాని కుక్క కానిది లేదు !

కస్తూ—సరి సరి నామాటకేమిలెండు- నామీఁది దయచేత నన్నిట్లు పొడిగించుచున్నారు!

శర్మ—నీతోడు ! నీసంగతి నీయెదుటఁ జెప్పవలసినది కాదు. నిశ్చయముగా నీవంటివాండ్రు కోటికి నూటికిఁ గొందరైన నుండుట చేతనే ప్రపంచము నిలిచినది ! అందుచేతనే, ని న్నాకాశమున

కత్తివలె ననుతలంపుతో, మంచి స్కీము నొకటి మనసులో స్థిర పఱుచుకొని వచ్చినాను. దీనితోడు నీ యంగీకారమే తరువాయి.

కస్తూ—ఏదో విశేషము లేకున్న మీ రేతెంచువారు కారని నేను మొదటనే యనుకొన్నాను. ఏమిటి యా స్కీము ? (Scheme)

శర్మ—జమీందారు రఘునాథరావుగారికిని నాకును, జచ్చినం జావు బ్రతికిన బ్రతుకు అనునంత ఫ్రెండ్‌షిప్పు. (Friendship)

గీ. తినుచునప్పుడు నేనును ♦ గుడువవలయు
మునుఁగుచున్నప్పుడు నేన్నును ♦ మునుఁగవలయు;
కాయములు మారి రెండుగఁ ♦ గానఁబడిన
మానసం బొక్కటియె కాని ♦ మారు లేదు.

కస్తూ—అంతవఱకు నే నాలకించినదే.

శర్మ—అట్లయిన నీకు నంతగాఁ జెప్పవలసిన పని లేదు. ఆ (Influence) యిన్‌ఫ్లూయన్సంతయు నీ నిమిత్తము వినియోగించి- నిన్ను బంగారు పిచ్చుకను జేయుటకు నిశ్చయించుకొన్నాను.

కస్తూ—ఏ విధముగా ?

శర్మ—ఏ విధముగా నేమిటి?- ఆయనకును నీకును అతుకుపెట్టి.

కస్తూ—(తనలో) ఇంతనిరాక నా కిప్పు డర్థమైనది. కనుక, నే నిప్పుడు కాసింత గడుసుతనముగా వెళ్లవలెను.

శర్మ—ఏమిటి యాలోచించుచున్నావు ?

కస్తూ—అనుకొన్న దొకటియు, ఆలకించిన దింకొకటియు నైన దని.

శర్మ—నీ వే మనుకొన్నావు ?

కస్తూ—(మొగము చిట్లించి) సరే, నే నే మనుకొన్న నేమి! అందని మ్రాని పండున కఱ్ఱలు చాచుట యవివేకము కదా !

శర్మ—అనఁగా ?

కస్తూ—అనఁగాను లేదు, వినఁగాను లేదు కాని— ఆరాత్రి మీరా యూరేగింపులోని కెందులకు వచ్చినారు ?

శర్మ—అందఱు నెందులకు వచ్చినారో- నేను నందులకే.

కస్తూ—అలాగునసా! ఆమాట తెలిసినచో- అందఱను జూచిన కన్ను లనే మిమ్ములను జూచియుండెడిదానను! (అని చరాలున మరలును)

శర్మ—వెళ్లకు వెళ్లకు- వెళ్లిన నొట్టు! (అని చటాలున లేచి, చేయి పట్టుకొని) ఇప్పు డన్నమాట యేమిటి?- అందఱను జూచినకన్ను లనే నన్నును జూచియుందువా? అట్లయిన, స్పెషల్ (Special) కంటితోఁ జూచినా వన్నమాటయే! నిజముగా నామీఁద నీకట్టి యభిమానమే యున్నచో- నీ పాదములపైఁ బ్రాణములువిడువనా!

కస్తూ—అమ్మయ్యో!- ఆపనిమాత్రము వలదు! బ్రతికియున్నచోఁ బైచూపులతో నైన భ్రమ తీర్చుకొనెదను.

శర్మ—(సంతోషముతో) వహ్వా! వహ్వా! వన్సుమోర్! వన్సుమోర్! ఏమి టేమిటీ? భ్రమా?- ఎవరిమీఁద?- నా మీఁదనే! ఆ బంగారునోట- ఆముద్దులమాట మఱియొకసారి యను!

కస్తూ—పిల్లికిఁ జెలగాటము, ఎలుకకు ప్రాణపోకడ యనునట్లు- నా మాట మీ కంత నవ్వులాటగా నున్నది! అదిగో- మరల నవ్వు చున్నారు! పోనిండు నే నికఁ జెప్పనే చెప్పను! [అని మరలును]

శర్మ—(మరల పట్టుకొని) నాతోడు! నన్ను చంపుకొని తిన్నట్టే! ఏ దేదీ?- ఆరాత్రి నన్నుఁ జూచినదిమొదలు?- చెప్పు మఱి!-

కస్తూ—చెప్పుట కేమున్న దేమిటి?-

ఉ. అన్నము తిన్న నొట్టు! నిదు ♦ రన్నది పోయిన నంతకన్న నో!
ఎన్నఁడు నిట్టివింత విని ♦ యేని యెఱుంగను! సిగ్గు! సిగ్గు! నా
కన్ను లివెంత దుండగపుఁ ♦ గన్నులొ- మీ వదనారవిందముం
గన్నక్షణంబునుండి మిముఁ ♦ గాంచుటకే పలవించు నిచ్చలున్!

శర్మ—హాయి హాయి! హాయి హాయి! అదృష్ట మనఁగా నాది! ఏదీ- ఆపాటున నొక్కముద్దు పెట్టు! (అని కౌఁగిలించుకొని ముద్దాడి) ఇదిగో- యిప్పుడు నాసంగతి చెప్పెద విను. నీకు నామీఁద నిన్న నో మొన్ననో కలిగినది కాని- నీమీఁద నాకు నిరుటినుండి పుట్టి నది! అయిన నాస్థితిలో నీయింటఁ గాలు పెట్టుట కిష్టము లేక—

మ. కనులార నిన్నిటఁ గాంచి హాయినొందనియటు గా వచ్చునంత నీ పాపనో పని యున్నట్టులె, వెళ్లితివిక్కొ వరుసంబు బల్లాయి మీరాయితీవం కను దారాడుచు- నీవు మేళములకే కన్నెంట నేనొంచుచుం దినము లుచ్చితి- నాయెదఁ ల్వినియె నా ఇతీ! హైనమీనాక్షీ!

కస్తూ—ఆడుదానికిని మగవారికిని గల యంతర మెంతయో చూచితిగా! నిరుటినుండి మీరు నివురుగప్పిన నిప్పువలె నుండి- నిన్నఁ గాక మొన్నఁ బుట్టిన నావలపు నేనిట్టె బయటఁ బెట్టుకొన్నాను!

శర్మ—ఇదిగో- నవ్వకుండ, నా మొగమువంకఁ దిన్నఁగఁ జూచి చెప్పు- నీవు నిజముగా నన్ను వలచితివా?

కస్తూ—(చిరాకుతో) ఇదిగో యిదే పురుషులయొక్క నీచస్వభావము!

శర్మ—నీతోడు నీతోడు!- ఆమాట మఱియొకసారి విని యానందింపవలె నని కాని- నిజముగా నీయందు నమ్మకము లేక కాదు. నీమాట నమ్మనివాఁడు నీయింటఁ గుక్కయై పుట్టు ననుకో! వచ్చినదా? వచ్చినచో, నావంక నొకసారి చూచి పక్కున నవ్వు! ఆఁ! చాలును! ఇక్కడి కొకరిమున సాకిరికిఁ దెలిసినది కనుక, నిఁక ముందుసంగతిని గూర్చి ముచ్చటింతము. నీకిడ నిఁక దాఁప రికమేల- నా మెడికల్ ప్రాక్టీసువల్ల నాకు వచ్చునది నా సిగరెట్లకుఁ జాలదు. అట్లు గాక, నిన్ను నేనే భరింపఁ గలిగినయెడల- చక్రవర్తికైన నీసాన్నిహిత్యముదొరకనిచ్చువాఁడనుగాను. అందువల్ల, రఘునాథరావుగారిని నీ కతుకు పెట్టి, ఆయనద్వారా నిన్నాకాశమున కెత్తుటకును- ఆయనచాటున నీతో నానందించుటకును నిశ్చయించుకొన్నాను. నీవుఁగూడ దీనికి "ఎస్" (Yes) అంటివా- నీకు నా మీఁద నిజముగాఁ బ్రేమ యున్నట్లె లెక్క.

కస్తూ—ఎస్సో నిస్సో నా కేమియుఁ దెలియదు. మగవారి భాషలో చన మగవారికే గాని- అర్థము శుభము నెఱుఁగని యాఁడుదానికేమి తెలియును? అందును నేను వట్టి యమాయికురాలను. నా కంటికి నల్లని వన్నియు నీళ్లు, తెల్లని వన్నియుఁ బాలు. ...

ముంచినను బాల ముంచినను మీఁదే భారము. ఆవగింజంతకూడ మీ మాట కెన్నఁడు నడ్డు చెప్పుదానను మాత్రము కాను.

శర్మ—అదిగో- అదీ మాట ! ఆమాటమీఁద నీవు నిలువఁబడితివా- యెల్లుండికి నీయొంటిని యేడువారముల నగలు తగిలించి, ఆవలెల్లుండికి అయిదంతస్తుల మేడమీఁదఁ గూర్చుండఁబెట్టు భారము నాది. ఈరాత్రి రఘునాథరావుగారి నిచటికి తీసుకొనివచ్చెద. ఒక రహస్యము- ఆయనకుఁ గొంచెము చుక్క యలవాటున్నది; సరే నాసంగతి నీవు వినియే యుందువు. అన్నట్టు, నీ కేమయిన రవంత యలవాటున్నదా ?

కస్తూ—(తనలో) రవంతకేర్మ మేమి- పూటకు బుడ్డి చాలదు ! (పయికి) నా కంతగ నలవాటు లేదు కాని- మీవంటివారు తటస్థమగునప్పుడు నియమముగాఁ బుచ్చుకొను వాడుక కలదు.

శర్మ—సరి యిఁక నేమి- చాలును. ఇం కొకటి- ఇంతవఱకాయన బ్రాండి విస్కీలే కాని- పయిరుచు తెలియఁగఁడు. పడఁదీసి నీ విప్పుడు పయిగ్రంథములోనికి దింపవలెను. అప్పుడుకాని మన కాయన యంకెకు రాఁడు. తెలిసినదా ?- సోడా విస్కీలు నేను బంపెదను. తక్కిన పదార్థములు నీవు తయారుచేసి సిద్ధముగా నుండుము. నేను పోయిరానా ?

కస్తూ—అమ్మయ్యో ! అప్పుడే వెళ్లెదరా ! శీఘ్రముగా వచ్చెద నని నా చేతిలోఁ జేయి వేసినఁ గాని- నేను వెళ్లనీయను !

శర్మ—ఓసి వెఱ్ఱిముండా ! నిన్ను విడిచి నేనుమాత్రము నిమిష ముండఁ గలనా ! అమ్మతోడు :- తొమ్మిది కొట్టుసరికి ఆయనయు నేను నిక్కడ నుందుము. ఒక్కటే మాట- ఆయాస మాయనది- అనుభవము మనది. ఈమాట మనసులో నిడికొని, యెట్లు మసలవలెనో యట్లు మసలుము. ఒక్కముద్దేదీ- (అని ముద్దు పెట్టుకొని, నిష్క్రమించును).

కస్తూ—(కుర్చీమీఁద గూర్చుండి) మొత్తముమీఁద నీతనికి నాపై

మోజుగానే యున్నది. రఘునాథరావుగా రీతనిచేతి గాట్నపుఁ దిరుగుడుగా నన్న ట్లిగవఱకు వినియె యున్నాను. ఏమో కిస్తూరి రేఖ బయటఁబడు కాలము వచ్చిన దేమో! ఎందులకుం గొఱ గాని ముండలకుఁ గూడ నెంతలేసి భాగ్యములు పట్టె లేదు!

సీ. కూటికిం గుడ్డకుఁ ♦ గూడఁ దిప్పలు వడ్డ
మీనాక్షి యద్దాల ♦ మేడఁ గట్టె!
పిలుపులకోసము వీథి ♦ వీథియుఁ దిరిగిన
మాణిక దివాణపు ♦ రాణి యయ్యె!
కడకు బేడకుఁ గూడఁ ♦ గక్కుర్తి పడినట్టి
కనకికి మోటారు ♦ కారు లోదనె!
పగలు గన్గొనఁ డ ♦ ప్పక రాత్రి కల నగ
పము రంగి జడ్జికి ♦ ప్రాణ మయ్యె!
వర్తకుఁడు, వైద్యుఁడు, వకీలు ♦ వారకాంత-
యనెడు నీ వకార చతుష్ట ♦ యముదె లతీవ్ర;
ఆదినో, మధ్యనో, లేక ♦ యంత్యముననో
వెలిగి తీరును ఇల నొక ♦ వెలుగు వీఁక!

మఱియొక విశేషము-

గీ. వర్తకున కూరఁ మేడయు ♦ వైద్యునకు కొంక
పతకమును; న్యాయవాదికి ♦ బండి; వేశ్య
కున్నతప్రాకటంబని ♦ గొప్పవెనని
పరపతియు, గౌరవము, వచ్చు ♦ బలియు హెచ్చు.

కాని, నేను నూపుగింజ వ్యవసాయములోఁ బడి కర్తవ్యము మఱచినాను! సోడా విస్కీ లతఁడు పంపును- పట్టెడు కోడిపిల్లలతో పయినంజులును సిద్ధము కాఁగలవు. నా ముస్తాబున కేమిటి దారి? అందును, దొంగకుఁ జీకటివలె- వేశ్యకు వేషమే యంగికుకము. నా తల్లిముండ నగలె కాక- సన్నచీరలుకూడ సారాయి కొట్లకు సమర్పించుచుండుటకుఁ బచ్చినదే కాదు! నా పిల్లని, నన్నును

గూడ మించినవాఁడు నా తమ్ముఁడు! అయినను, వారి ననవలసిన పని లేదు-

చ. తలఁపఁగ నారికాంతలకు ♦ త్రాగుడు; పాములకున్ సుషుప్తి;లో
భుల కమిత వ్యయేచ్ఛ గల ♦ పుత్రులు; చోరులకుం బణంబు;కా
ఫుల కెడలేని కోర్టుతగ ♦ వుల్; పనివాండ్రకు బద్ధకంబు; బా
పల కసమష్టి దోషమును ♦ బ్రాప్తిలకుండినఁ బట్ట శక్యమే!

వెంకటేశము—(సత్వరముగాఁ బ్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా! అగ్గిపోరులాంటి బేరం తగిలింది! అదేవి టల్లా వున్నావు?

కస్తూ—నా యుండుట కేమి కాని- ఏమి టాబేరము?

వెంక—కాసింసాహేబు నీమీద కన్నేశాఁడు.

కస్తూ—ఏ కాసింసాహేబు? సిరంవారి మేడలోని సిల్కుబట్టల వర్తకుఁడా?

వెంక—అతఁడే అతఁడే! నిన్న గుమ్మంలో నుంనుండగా నిన్ను చూచాట్ట- అప్పణ్ణుంచీ, అట్టుడికిన ట్టుడికిపోతున్నాఁడు. వట్టి వాజముండాకొడుకు! నేల చూపి నెత్తి గొట్టొచ్చును. ఇదుగో- యీచొక్కా అత డిచ్చిందే. చెపితే నమ్మవు- చేతి కెముక లేదు! రవంత నువ్వు రంగు చేశావంటే- రమ్మ పిల్చినట్టు పిల్చెయ్యొచ్చును. వీధిలో నుంచోబెట్టి వచ్చాను- ఏఁ వంటావు?

కస్తూ—అట్లయిన, నొక సంగతి చెప్పెద నాలకింపుము: ఈ రాత్రి జమీందారు రఘునాధరావుగారు మనయింటికి రాఁగలరు-

వెంక—(ఆత్రముతో) ఏఁవిటీ!- జమీందారుగారే! అబ్బో! అబ్బో! అయితే యిం కేఁవీ!- అదృష్ట దేవత మా అక్కయ్య చుట్టకు అగ్గిని ప్పందించిం దన్నమాటే! కల్లుకొట్లకు నేను కారుమీద వెళ్లా నన్నమాటే! వో! వో! వొళ్లు గరిపొడుస్తోంది! అయితే, అక్కయ్యా! యీ కబు రెల్లా వొచ్చింది?

కస్తూ—ఆసంగతి యావల చెప్పెదను. ముం దీసంగతి విను: పనివచ్చునరి కింట నొక పట్టుచీరయైన లేకపోయినది. సాహేబుకడ నొక సిల్కుచీర సంగ్రహింపఁ గలవా?

వెంక—అబ్బే- అదెంత పని! కాస్త నువ్వు కొంగు తాకించావంటే కావల్సినన్నిచిప్లు. ఇదుగో- యిమ్మకొస్తానుండు. (అనివెళ్లును.)

కస్తూ—తురకసరసమునకు రవంత చులుకదనమవసరము- చులుకుదనమునకు రవంత చుక్క యవసరము. (అని యలమారిలోని బ్రాందిసీసా తీసి కొంచెము త్రాగును.)

వెంక—(కాసింసాహెబుతోఁ బ్రవేశించును.)

కస్తూ—(మందహాసముతో) సలామండి- సాహెబుగారు !- సలాం !

కాసిం—(కంగారుతో) సానివాళూ మాకీ సలాం సెస్తే- సానివార్కి మేం- సలాం మీదా సలాము సెస్తాం ! (అని సలాం చేయును.)

వెంక—అక్కయ్యా ! సాహెబు బావయ్యగారికి నీమీఁద చాలా సరదా పుట్టింది. నిన్నట్నుంచి నీకోసం- నిప్పుతొక్కిన కోతిలాగున్నారు. వాళ్ల ముద్దెరితివా- వొందరూపాయలిస్తారు. ఏం బావయ్యగారూ ?

కాసిం—ఠీక్ ఠీక్ ! మనషులోదీ మాంగా- బయిటికీ- బరాబర్ తీసి- మీ ముంగలా యేశాడ్. ఘుమ్మంలో మిమ్మల్ని సూశాం- ఘుప్పునా మొఘాన్ని ఖన్నా యేశాం- ఘుండెల్లో, ఘుబల్ ఘుబల్ బయిదెల్లింది ! సాఫ్కీ యెల్లాం- సందుగాకాడా కూకున్నాం- ఘుండెల్లో, ఘుబుల్ ! ఘుబుల్ ! ఘుబుల్ ! నవాజ్ సేస్కున్నాం- నాస్తాకాడా కూకున్నాం- ఘుండెల్లో, ఘుబుల్ ! ఘుబుల్ ! ఘుబుల్ ! బేడీ గిడీ కాల్సుకున్నాం- బిశానామీదా తొంగున్నాం- ఘుండెల్లో, ఘుబుల్ ! ఘుబుల్ ! ఘుబుల్ ! కంటికీ రెప్పా తగిల్తే- గాబ్జీ మాదీ వొఖటి !

కస్తూ—మీ గుబులు నేను తీర్చెదఁ గాని - యిటువచ్చి యీ కుర్చీపైఁ గూర్చుండుఁడు.

కాసిం—మాకీ కూకో మంటే కూకుంటాం- మల్లీ- గులాంమల్లీ కమ్మంటే- గులామల్లీ అవుతాం.

వెంక—బలే ! బలే ! మా బావయ్యగారిమంచి పసన్మాకింద !

కాసిం—(సంతోషముతో) అరే! అరే! మాదీ మాంగా—మీదా అసిందీ వోగ్! మంచీమాంగా సెప్పిం దాన్కి— మళ్లీ— యీనాం విస్తా పుచ్కో! (అని జేబులోని రూపాయలు తీసి) ఏక్, దో, తీన్, చార్, పాంచ్! (అని చేతిలో వేయును).

వెంక—(తనలో) నాడి నాకు ముట్టింది! ఇప్పుడు నా ప న్నేవీ లేదు. ఇంతలో వోసారి కొట్టుకాడికి పోయి చక్కావస్తాను. (నిష్క్రమించు).

కస్తూ—ఇటువచ్చి కూర్చుండవేమి? (అని చేయిపట్టి లాగును.)

కాసిం—(పారవశ్యముతో) హవ్వా! హవ్వా! క్యామజా రే బావా! క్యా మజా!

కస్తూ—అయ్యో దేవుడా! అదే మళ్ళీ కన్నులు తేలవేయుచున్నావు! కొంచెం తీసి గోవిందా కొట్టెడు గదా! (చేయి విడుచును)

కాసిం—అరే! అరే! సచ్చిపోయాం! సచ్చిపోయాం! సాహేబానా! మీకీ సలాం సేస్తాం— సెయ్యికి సెయ్యి తగిలిచ్చి— సెనం పుంసుకోండీ! మీదీ సై తగిలేతల్కే— మాదీ పానం— మక్కా యెల్లింది!

కస్తూ—అలాగునా! అట్లయిన, నీసారి రెండుచేతులు తగిలించెద లెండు! (అని రెండుభుజములమీదను రెండుచేతులు వేయును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా! అచ్ఛా! అల్లా మీ సేతుల్లో అవల్ ఖుషీ— బలే సౌఖ్యం పెట్టాడిండీ! అందుకూశాతే— బలే బలే వోళ్లంతా— మీ పాదాల్ మీదా పానం యేస్తాం!

కస్తూ—మా చేతులకు మీ అల్లా మఱియొక గుణముకూడ పెట్టినాడు. మీ జేబులలోం బ్రవేశించునంతకును మిలమిల లాడక మానవు! (అని జేబులు తడివి, యంగిలి నోట్లు తీసి) అఁ అఁ! నోట్లు! నా కొఱకే తెచ్చియుండెదరు. నవాబు దర్జా యనఁగా— ఇది!

కాసి—అదీ మాట! అన్కా— దయా మాకీ షల్లంగా వుంటే— కన్నిల్ నేతా నోట్లూ— కన్ఫుల్ కన్ఫుల్ నక్కిస్తాం!

కస్తూ—అంతవారే మీరు. అన్నట్టు— కూర్చుండ వేమి? (అని లాగును.)

కాసిం—వొస్తాం, వొస్తాం,— జర్రా నిలండీ! (అని కాళ్ల చెడావులు తీసి చేతం బట్టుకొని) బస్— చలో!

కస్తూ—(నవ్వు బిగఁబట్టుకొని) చేతిలో చెడావు లెందులకు ?

కాసిం—క్యా - చెడావ్ చోడ్దేనా ? అచ్ఛా ! (జోడు క్రింద నైచి, కూర్చుండి) మళ్లీ - మీ ఘ్యాలోంది- మాపానం వోరుస్తాదండి ?

కస్తూ—అట్లయిన నిదిగోఁ గూర్చుండెద. (అని యొడిలోఁ గూర్చుండును)

కాసిం—(పారవశ్యముతో) అచ్ఛా ! బొహ తచ్ఛా ! అవల్ ఖుషీ యిప్డూ అందుకుండీ- అమారా మస్తూ- పలావ్ డేక్శాలో పక్వా యేసీ- మాళ్లీపండ్లో మకాం సేసీ- హల్వా మేసీ- హంజూరా కొర్క్కి- బీడీ కాల్సీ- గుడాక్ పీల్సీ- ఖుష్మయ్యా పొయ్యింది !

కస్తూ—సరి కాని- సాహెబు గారు ! మీకు గడ్డ మెందులకు ?

కాసిం—బోల్నా ? కాపోడ్కి- కాడీ- కమ్మోరుడ్కి- పాడీ; గుమ్మాన్కి- సీకీ- ఖులాసాకీ బీడీ; పడుసోళ్లకీ జోడీ- పలావుకీ కోడీ; రవుత్కి- ఘోడీ- రాజేకీ కోడీ; ముల్లుకీ జేడీ- ముసల్మాన్కి- దాడీ- ముఖ్ఖం, ముఖ్ఖం ! మీ అందాన్కి- తోడూ- మీ మూతీకి- దాడీ వుంటే- గజ్జఖరీ మీ పాదాల్కాడా సచ్చిందీ మాట !

కస్తూ—అయితే, హిందువులకు మీ రన్నిట వ్యతిరేక మంట కా ?

కాసిం—అదీ మాటా ! హిందూవాడూ మీదా పెంచీ, కిందా గొర్గితే- మాదీ కిందా పెంచీ, మీదా గొర్గుతాయ్. హిందూ వాడూ పొడంనుంచీ ఖుడ్కి- రాస్తే- మాదీ ఖుణ్ణుంచీ పొడాన్కి- రాస్తాయ్. హిందూవాడూ పేరుం నమ్మితే- మాదీ ఖురా న్నమ్ముతాయ్. హిందూవాడూ శపం సేస్తే- మాదీ నమాజ్ సేస్తాయి. హిందూవాడూ కాసీ యెల్తే- మాదీ మక్కా యెల్తాయ్.

కస్తూ—హిందువులు కాళ్లతో నడువ- మీరు తలంతో నడువ రేమి ?

కాసిం—మాకీ తలా నేలకీ తగిలిసిస్తే- మాసీ పోడండీ ?

కస్తూ—మాసిపోయినచో, మడేలువానిచే నుతికించుకొన వచ్చునుగా ?

కాసిం—వుత్కితే దాడీ వూడీ పోదండీ ?

కస్తూ—(పక పక నవ్వి) అదా వచ్చిన చిక్కు ! (తనలో) అప్పు- అమాయుకత్వము ! కనుకనే, యంత సామ్రాజ్యమును గం[illegible]

గలిపి- కట్టుపనికిని, గుమ్మము కావలికిని సిద్ధమయినారు! (పయికి) సాహేబుగారు ! మీ పూర్వు లెంతటివారో యెఱుఁగుదురా?

కాసిం—జత్రా సెప్పండీ యింటాం !

కస్తూ—చెప్పు మనెదరా ? (అని లేచి)

సీ. భరతఖండం బెల్ల ♦ పాలించి సిరులతోఁ
దూఁగినవారు మీ ♦ తురకవారు

కాసిం—అదీ మాటా! యిందండీ యీనాం! (అని యుంగర మిచ్చును)

కస్తూ—వీరులై పోరుల ♦ వీరాధివీరులఁ
ద్రుంచినవారు మీ ♦ తురకవారు

కాసిం—అచ్ఛా! అచ్ఛా! మా సేత్కి కత్తి యిస్తే- మజా సూస్తాం!

కస్తూ—నవరత్న సింహాస ♦ నంబులఁ గూర్చుండి
తోడరినవారు మీ ♦ తురకవాగు

కాసిం—(దిగ్గన లేచి) ఛూ! కుర్చీమీదా కూకుండీ- కుక్కా అయ్యాం!

కస్తూ—భోగంబునందును ♦ త్యాగంబునందును
తులలేనివారు మీ ♦ తురకవారు

కాసిం—బరాబర్! పండగా దిగ్తే- పలావ్ మీదా పడి సచ్చిపోతాం!

కస్తూ— శూరవరులకు జాగీరు ♦ లూరి కొలువు
కాంద్రకెల్ల మిరాసీలు ♦ కవుల కగ్ర
హారములు, పండితులకు మా ♦ న్యంబు లొసఁగి
తుఱఁగలించినవారు సిబ ♦ తురకవారు!

కాసిం—అదీ మాటా ! అంతా సెప్పిందాన్కీ- సానీ నాక్కీ మేం సంతోసం సేస్తాం- కోరండీ- ఆఫ్కా ఖుషీ- కోరండీ !

కస్తూ—మాట తప్పరుగద ?

కాసిం—మాటా తప్తే- తురకా బిడ్డా మాసీ- దూదేకె ఓడ్డా బోలో!

కస్తూ—అయితే, యీ రాత్రి సిల్కుచీర కట్టుకొని హాయిగా మీతో నుండవలె నని యున్నది- పంపెదరా?

కాసిం—యిస్కా- మాకీ తుఖ్డా-యిదా సెప్పిందీ- కాకీమీదా యేసి,

కట్టా సీరల్ పంస్తాం- తమర్కి నచ్చీలాయిందీ తారీఫ్ సేస్కోండీ.

కస్తూ——కాకిమీఁదను వలదు- గాడిదమీఁదను వలదు. అదుగో మా తమ్ముఁడు వచ్చుచున్నాఁడు- అతనిచేతఁ బంపుఁడు.

కాసిం——అదీ మాటా! హోదాగంటా, హవ్వే తల్కి, హాఁ సీరల్ హిఁకా హుండ క్కోతే- మాదీ బాత్- మంజూర్ సెప్పకండీ!

వెంక——ఏఁవి టక్కుమ్యా! యేఁవిటి?

కస్తూ——మీ తురకబావగారు సిలుకుచీర లిచ్చెదరఁట- వెంట వెళ్లుము.

వెంక——వో! రండి బావయ్యగారూ- రండి! (అని పట్టి లాఁగును.)

కాసిం——అరే! హుండూ వోయ్ హుండూ! హుకుం తీస్కోనీ! సలామండీ సానీవాహూ- సలాం! మఖ్ఖా మీకీ తగిల్పిచ్చి- మీద్ సెగళం సాపుకీ యెల్తాయ్. సీరా కట్కీ మీర్ సిఖంగా హుం కే- మళ్లీ వొచ్చి మేం మజాఖా సూస్తాం! చలో- సాలా!- చలో! (అని వెంకటేశముతో నిష్క్రమించును.)

కస్తూ——ఇక్కడికి, చీడ బెంగ తీఱినది!

సీ. ఆఱిపోయిన చుట్ట ♦ కగ్గి చేకుఱినట్లు
అంకటితఱి నన్న ♦ మమరినట్లు
లేవడిలో లాట ♦ రీ వచ్చిపడినట్లు
పొరుగూరిలో నప్పు ♦ పుట్టినట్లు
నట్టేటఁ జేతిక ♦ నావ చిక్కినయట్లు
కటువులో వర్షము ♦ గురిసినట్లు
జగ్గు వేసఁగి నెండ ♦ బత్తె మూసినయట్లు
ఖైదీస్తులో నాఁబ ♦ పడినయట్లు
సమయమున కేగుదెంచి యీ ♦ సాహెబయ్య
సలుక మా యిచ్చి, చీరలుం ♦ బంపుచుండె;
మంచిదినములు గడుగ మీ ♦ పించె ననుట
కింతకన్న నిదర్శన ♦ మేమి గలదు! (అని నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.




# చతుర్థాంకము

## మొదటి రంగము

ప్రదేశము:—రఘునాథరావుగారి మేడవీధి.

విశ్వా—(కాగితములు చేతఁ బట్టుకొని ప్రవేశించి) సందియ మేమి!-

గీ. మూర్ఖ భూపతి సేవయు ♦ మూర్ఖ రోగి
వైద్యమును; మూర్ఖ భృత్యుని ♦ పాలనంబు;
మూర్ఖ శిష్యుని చదివింపు ♦ మూర్ఖ భార్య
పొత్తు- పగవాని కేనియుఁ ♦ బొసఁగ రాదు !

మా ప్రభువు మూర్ఖప్రభువు కాకపోయినను, మధుసేవా పిశాచ మావహించినది మొదలు- ఊసరవిల్లివలె- ఉదయ మొక రంగు, సాయంకాల మొకరంగు లోనికి దిగినాఁడు ! ఆ పయిని, శనిగ్రహమువలె నీ శర్మయొకఁడు దాపురమై- మఱింత మాఁపి వేయుచున్నాఁడు !

చ. పడుచుతనంబు, స్వేచ్ఛయును ♦ భాగ్యము, త్రాగుడు, దుష్టమైత్రి, యే
ర్పడ నివి యొక్కొ-టొక్కటియె ♦ బ్రహ్మనుసైతముఁ బ్రక్కదారికి
న్నడపి, వివేకముం గెడపి, ♦ నాశ మొనర్పఁగఁ జాలి యుండ- ని
య్యెడ నవి యన్నియుం గలిసె ♦ నెంతకు నేనియుఁ దేక మానునే!

(పరిక్రమించి) దివాణపు వ్యవహారములను దిలకించుట లేదు- జాగు సేయుటగని కాగితములపైఁ గూడ సంతకములు చేయుట లేదు- క్షణము మాటాడుటకు సమయ మిచ్చుట లేదు ! అపైని, పయికమునకు హద్దు లేని చీట్లు- అడిగిన వర్తకుల కూరిలో నప్పులు- ఇంకను వచ్చినదాక నిఁకఁ గనువారి యేమిటి !

సీ. సమధికం బైన పు ♦ చ్చా యగ్రహార మీ
మార్గంబున నె కదా ♦ మాసిపోయె !
ఘనతరం బగు నిను ♦ గంటి సంస్థాన మీ
తీరున నే గదా ♦ తిరుగఁ బడియె !
కోమ లైన కోచ్చెర్ల ♦ కోట ప్రభుత్వ మీ
విధమున నే గదా ♦ శిథిల మయ్యె !
రేప రేపలోను మా ♦ రెళ్ల దివాణ మీ
చందంబున నె గదా ♦ సన్నగిల్లె !
ప్రభువు దుర్వ్యసనంబుల ♦ పాలఁ బడిన,
వర్తకుండు కాఫీహోటల్ ♦ వంకఁ జనిన,
తిరుణవిద్యార్థి నాటక ♦ స్థలిని బడినఁ
జల్లచల్లఁగ ముప్పు వా ♦ టిల్లి తీఱు !

అందును, బ్రాహ్మణ సంస్థానముల కష్టమయ కాలమే వచ్చినది !

మ. వ్యభిచారంబు, దురోదరంబును, సురా ♦ పానంబు సాగించి, జా
త్యభిమానంబు త్యజించి, యన్యమత వే ♦ షాచారము ల్బూని, పా
పభయ మ్మూడ్చి,సిరు ల్తొలంగ, ఋణముల్ ♦ పైయాడఁగా, బ్రాహ్మణ
ప్రభువుల్ పుచ్చిన చెట్టులంబలె నశిం ♦ పంజొచ్చి రత్యంతమున్ !

బ్రాహ్మణ సంస్థానముల కే కాదు- బ్రాహ్మణ జాతి కే శనిగాఁడు పంచ్రెండింటఁ బ్రవేశించినాఁడు !

సీ. చెప్పినట్టులు నడ ♦ చిన కాలమున కర్త
వారి కుం డయ్యెను ♦ బ్రాహ్మణుండు
నిన్నటిదనుక మ ♦ న్నించిన దొరలకు
ప్రాణగొడ్డం బయ్యె ♦ బ్రాహ్మణుండు
ప్రేమతోఁ బూజ స ♦ ల్పిన శూద్రజాతికి
పల్లేరు ముల్లయ్యె ♦ బ్రాహ్మణుండు
మొదటనుండియు స్వార్థ ♦ ముగ నున్న యుద్యోగ
పదవికి పితు గయ్యె ♦ బ్రాహ్మణుండు

నేర్చి సకలకళలు ♦ నేర్పి లోకుల కవి
బ్రహ్మదేవుఁ డనఁగఁ ♦ బరఁగి నట్టి!
బ్రాహ్మణుండు నేఁడు ♦ బాపనోఁ డయ్యెను!
కాలమహిమ కాక ♦ కత మిఁ కేమి!

అయినను, దీని కన్యుల ననవలసిన పని లేదు-

సీ. ముద్దినుసులు పండి ♦ ముంగిళ్లు నిండించు
మళ్లు మాన్యములు క ♦ వుళ్ల కిచ్చి
తోటలుం దొడ్లు ను ♦ స్తుగ తాకటులు పెట్టి
పెళ్లున నిండ్లఁ బెం ♦ డ్లి ళ్లొనర్చి
కొంపలుం గోడలుఁ ♦ దెంపుమై తెగనమ్మి
యేండ్లకొలంది వ్యా ♦ జ్యములఁ జొచ్చి
పుస్తెలుం బూసలుఁ ♦ బుణికి కర్చుల కిచ్చి
పుత్త్రులం బెంచదు ♦ వులకుఁ బుచ్చి
సౌఖ్యముల కాకరము లైన ♦ స్వస్థలములు
వీడి, పొరుగూళ్ల బానిస ♦ వృత్తి నమరి
తమదు ద్రవే ల్పెట్టి తమకన్న ♦ తామె పొడుచు
కొనుచున్నారు బ్రాహ్మణ ♦ కులమువారు!

(కొంచెము నడచి) ఈ కాగితములపై సంతకములు చేయించుట కిపూఁట యైన సమయము చిక్కునో లేదో! అదుగో సిపాయి చిన్నయ్య బయటనే యున్నాఁడు. (పరిక్రమించి) చిన్నయ్యా! బాబుగా రేమి చేయుచున్నారు?- ఏ మంటివి? "బాబుగారును శర్మగారును గలిసి బయటి కెక్కడికో వెళ్లినా" రనియా? ఇదివర కెన్నఁడుఁ జీఁకటి పడినవెనుక నిల్లు కదలు నాచారము లేదే! కొంపతీసి క్రొత్తనాటక మేదేని ప్రారంభము కాలేదు గద! సరే, కానిమ్ము- సాహిణులవల్ల సంగతి తెలియక పోదు గదా! (అని నిష్క్రమించును)

---

మొలకవలె నిట్లు క్రుగ్గవలసిన యోగము నా కేల పట్టినదో !

ఉ. అంతటి యింటఁ బుట్టి, యటు • లందఱకున్ స్మరిపింపుబిడ్డ నై
యింతటి యిల్లు చొచ్చి, తుద • కీగతిఁ దోడును నీడ లేక, కొం
డంత వ్యథం భరించుచు, న•హర్నిశ లొంటిగఁ బుచ్చ నయ్యె! హా!
యెంతని యోర్వ నేర్తు మది • నెంతని ధైర్యము గాంచ నేరుతున్!

(క్షణ మూరకుండి) సందియ మేమి !—

సీ. మామ దురాగ్రహ • మానసుం డగుఁ గాక
యత్త మహామారి • యగును గాక
బావలు మఱఁదు ల • ప్రాజ్ఞులౌదురు గాక
యాఁడుబిడ్డ పిశాచ • మగును గాక
కన్నవారలు దైన్య • గతిఁ జరింతురు గాక
గర్భశోకాపత్తి • కలుగుఁ గాక
అన్నవస్త్రంబుల • కతిలోప మగుఁ గాక
అడవిలోఁ గాపుర • మబ్బుఁ గాక
భర్త యోగ్యుఁడు, ననుకూల • వరుఁడు నేని
పడఁతులకు స్వర్గ మఱచేతఁ • బడినయిల్లు;
మగఁడు జడుఁ డగు నేని, కో • మలుల కిహమ
నందె నరకంబు ప్రత్యక్ష • మగు నిజంబు !

ఇంతకన్న నే నిఁకఁ జేయవలసిన దే మున్నది!-

సీ. మనబోంట్ల కియ్యది • మర్యాద కా దని
నోరు నొచ్చినదాఁక • పోరినాను
మద్యపానముచేత • మాసిపోయిన యట్టి
కాఁపురా లెన్నియో • చూపినాను
పరదేశములు మద్య • పాననిముక్తికై
[illegible] ములను బోధ • పఱచినాను
[illegible] నైన • నీ దురభ్యాసంబు
మాన్పుకొమ్మని ప్రార్థి • మాంపినాను

ఏమి లాభ మిద్ది ♦ యెల్లను బూదిలో
బ్రేల్చు ఘృతము వలెనె ♦ విఫల మయ్యె!
వారివారి నొసటి ♦ వ్రాతఫలమె కాని-
చెప్పువారు లేక ♦ చెడిన దెవరు !

(వినుట నభినయించి) ఎవరుచెప్పుచూ వచ్చుచున్నారు ! కక్కగారు కారుగద ?- అవును- ఆ యడుగులసడి యాయనదే. ఆయన గారావిధముగా నుద్యోగమునుండి తొలఁగించినను, కంటిని ఱెప్పవలె నన్నియెడల కాపాడుచునే యున్నాఁడు గదా !

గీ. ఎగ్గు చేసిన వారల ♦ కేని మేలు
సలుపుటే మంచివారల ♦ సహజ గుణము
పాఱతో లోఁతుగా గాయ ♦ పఱచినట్టి
వారలకు భూమి యొసఁగదే ♦ నీరములను ! (లేచును.)

విశ్వా—(విషాదముతోఁ బ్రవేశించి తనలో) అర్థులకు నాస్తి వచనము- ఆప్తులకప్రియ వచనమును దెలుపుట యతి కష్టము !

గీ. అన్నమునఁ, బున్నము నెఱుంగ ♦ నట్టిగోల
సుగుణముల ప్రోవనం దగు ♦ సుభగశీల
అట్టి యిల్లాలి కిటువంటి ♦ యప్రియంబు
తెలుపుట యనంగఁ బ్రాణముల్ ♦ తివియుటె కద !

నిర్మ—రండు కక్కగారు!- రండు- ఇదిగో కుర్చీ. (పరికించి) ఆదేమ ట్లున్నారు- క్రొత్త లేమియు లేవు గద !

విశ్వా—అమ్మా! ఆపద లొంటిగా రా వన్నవాఁ డజ్ఞుఁడా !

ఉ. నమ్మిన గుండెకాయ యన ♦ నాదు పితామహుఁ డాది నీ దివా
ణమ్మును గొల్చె; నా వెనుక ♦ నాజనకుండుఁ దదర్థ మస్మి ప్రా
ణమ్ములు ధారవోసె; నిఁక ♦ నాకథ యేమిటి- కట్టిదాని నేఁ
డమ్మరొ! మా ప్రభుండు తెగ ♦ నమ్మఁగఁ జూచు నవస్థ వాటిలెన్!

నిర్మ—(ఒక్క నిట్టూర్పు పుచ్చి) నరే- అనుకొన్నట్లే యైనది! జరుగఁగల సంగతి యిది యని- నాకుఁ జాలదినములక్రిందటనే తోఁచినది!

విశ్వా—కష్టములలోఁ గష్టము- కడకీ మేడయైన మిగిల్చినారు కారు! వారము దినములలో దీనిని వప్పగించి తీరవలెను!

నిర్మ—శ్రీ రామ రామా! చివర కెంతటి దురవస్థ పట్టినది! ఓసీ మృత్యు పిశాచమా!

చ. ప్రవిలసమైన కాంపురము • బగ్గున గాల్చి దహించినావు! ప్రా
భవ మఖిలంబుఁ జొప్పడిన • పాలుపనే దిగమ్రింగినావు! శే
షవ విభు భర్తకే మొగము • వాచి తపింపఁగఁ జేసినావు! చే!
చివరకుఁ జెట్టుక్రింద నిడ • సింప విధించినదాన వే ముదా!

(కొంత మూరకుండి) కన్నగారు! ఇప్పుడు కర్తవ్య మేమిటి?

విశ్వా—అదియే పాలుపోక యాలోచించుచున్నాను. సవిస్తరముగా నాయనగారికి సంగతులు తెలియఁజేయుదు మనిపించెనా?

నిర్మ—వలదు వలదు- అది నా కంతయు నిష్టము లేదు.

విశ్వా—అట్లయిన నింక నన్యాలోచన మేల?- గృహ భ్రష్టులమగుటలో పవిత్రత కలుగును.

నిర్మ—అదికూడ నా యభిప్రాయము కాదు. ఈ భారముగూడ మీ తలకెక్కుట నా కిష్టము లేదు. పోయినవి పోఁగా- చిన్నచిన్న వస్తువులు కొన్ని మిగిలియున్నవి. మడతపెట్టని పట్టుచీరలు కొన్ని మందసములలో మ్రగ్గుచున్నవి. ప్రస్తుతము పనిలేని నానా సామగ్రి యెంతయో యున్నది. వీని నన్నిటిని విక్రయించి, వచ్చిన సొమ్ములోఁ గొంత వడ్డీకి వేసి, కొంతతోఁ జిన్న కొంప యొకటి కొనిపెట్టితిరా- ఆవడ్డీతోఁ గాలక్షేపము చేయుచు, నాకొంపలోఁ బడియుండెదను.

విశ్వా—అట్లయిన, నగావీధి నొకయిల్లు అమ్మకమునకు సిద్ధముగా నున్నది. నేను వెళ్లి దానిని నిశ్చయించుకొని రానా?

నిర్మ—సరియే! మీరు చెప్పిన వెళ్లి నిశ్చయించుకొని రండు.

తెర పడును.

లజ్జ యింకను నాలో మిగిలి యున్నదా !...సరే కానిమ్ము—
"సాహసే లక్ష్మీ"యని శాస్త్రము కదా?(అనిపోయి తలుపు తట్టును)
తెరలో—ఎవరు వారు ?
రఘు— ఇంకెవరు?- నేను !
నిర్మ—(చటాలునఁ దలుపు తెఱచి, సంతోషముతో) ఏమీ-
మీరేనా! యేమి యదృష్టము ! రండు రండు- లోపలికి రండు !
(అని తోడుకొనిపోయి) అయ్యో ! కుర్చీ లేకపోయినది కదా !-
ఇదిగో- యీపీట పైఁ గూర్చుండుఁడు ! (అని పీట వేయును.)
రఘు—(విన్నదనముతోఁ గూరుచుండును.)
నిర్మ—(చెంతఁ గూర్చుండి) మహాభాగా ! యీ దీనురాలిపై నింత
దయ వచ్చినది- ఈప్రొద్దు నేను లేచిన వేళావిశేషమా యేమి ?
రఘు—వరి కాని- అంత సన్నగిలి పోయితి వేమి ?
నిర్మ—నా సన్నగిలుట కేమి !- మీ రెంత సన్నగిలినారో- యెంత
తారుమా అయినారో యెఱుఁగుదురా ! శివశివా ! యీ బాలక
మునకుఁ దోడుగా నీ గుడ్డ లెక్కడ దాపరించినవి !
రఘు—అవస్థ మాఱినప్పుడు-హంగులు కూడ మాఱవా ?
నిర్మ—ఇట్టి యవస్థకుఁ గారణ మేమో మీ కిప్పటి కైన తట్టినదా ?
రఘు—తట్ట కేమీ- ప్రారబ్ధము !
నిర్మ—ప్రారబ్ధము కాదు- బ్రాందిబుద్ధి !
చ. మడిసిరి మద్యపానమున ♦ మత్తిలి యొత్తుగఁ బోరి యాదవుల్;
జడమతియై నశించెఁ బృథు ♦ సారుఁడు మద్యరసంబుఁ గ్రోలి; శు
క్రుఁడు తన దృక్కులం దొకటి♦కోల్పడియెన్ సురఁ ద్రావి;యక్కటా!
చెడని జనుం డెవండు- మధు ♦ సేవ యొనర్చి ధరాతలంబునన్ !
రఘు—పురాణము లన్నియుఁ బూర్తిగా స్టడీ (Study) చేసినావే !
నిర్మ—ప్రాణేశ్వరా ! యీ పరిహాసముల కేమి కాని-
సీ. పదుగురిలో సహిం ♦ పఁగరాని తలవంపు
దగ్గఱ కేతేర ♦ తగని కింపు

శ్రుతి మించినకొలంది ♦ మితి లేని ధనహాని
పదును దప్పినయెడ ♦ ప్రాణహాని
బ్రతికినన్నాళ్లు దు ♦ ర్భరమైన యశక్తి
ఆలు బిడ్డల కుగ్ర ♦ మైన యార్తి
కాలు సేతులకును ♦ కుదలేని తడబాటు
పూర్తిగ సహారం ♦ బులకుఁ జేటు
పాపముల కూఁత, నోరు వి ♦ ప్పగనె గోఁత
లేచిన శవంబు, మేను ప్రా ♦ ణ్విన శవంబు;
కోరి కొని తెచ్చుకొను గోఁతు ♦ కోఁత గాక
మద్యపానంబువలన సే ♦ మంబు గలదె!

రఘు—(పకపక నవ్వి) హాయి! హాయి! ఏమి లెక్చరు! ఏమి లెక్చరు! ఫస్టుఫ్లాటుజాన్సనుగా రిఁక పూర్తిగా రిటైర్(Retire)కావచ్చును!

నిర్మ—మహాభాగా! మాఁకులెక్చర్లతోఁ బని యేమిటి?- త్రాగుడు యొక్క ఫలితమునకు- త్రాగినవాని దర్శనమే లక్షలెక్చర్ల పెట్టు! ఆ పీడమొగము, ఆ పీచుతల- ఆ కొఱవికన్నులు, ఆ కొంకిమెడ- ఆ కోరచూపు, ఆ కోఁతిరూపు- ఆ వదలుకాళ్లు, ఆ వడకుచేతులు- ఆ వెకిలినవ్వు, ఆ వెఱ్ఱివాగుడు- ఆ తూలునడక, ఆ ధూళిములక- ఆ మఱపు తెలుపులు- ఆ మాటవిఱుపులు- ఆ తడబాటు, ఆ తబ్బిబ్బు- ఆ వాలకము, ఆ వాచాలత- ఆ యాగ్రహము, ఆ యనుగ్రహము- ఆ యీవి, ఆ తీవి- ఆ దుడుకు, ఆ దురుసు- ఆ తిక్క, ఆ తిమ్మిరి- ఆ కంపు, ఆ గతర- ప్రత్యక్షముగాఁ జూచి కూడ పానచింత మాననివాఁడు పశువు కాక- మనుజుఁడా!

రఘు—(నవ్వుచు) రామరామ! రానురాను లెక్చర్లలోనికిగూడ దిగితి వేమి!

నిర్మ—(చెంపలు వైచుకొనుచు) మహాభాగా! మన్నింపుఁడు! ఆవేశ వశమున నట్లు నోరు జారినది! నా మన సెంత కరగిపోవుచున్న దో- నారాయణుఁ డెఱుఁగును! నేను గాంపురమునకు వచ్చి మూఁ డేండ్లయినది. ఈ మూఁడేండ్లలో మూఁడురాత్రు లైన నిశ్చింతగ

నిద్రపోయి యెఱుఁగను! నాసింత కన్ను మూసినను గంటలోనున్న
మీ చింతయే ప్రతి పురాణమును పరికించినాను- ప్రతి శాస్త్రచరి
త్రమును బరిశీలించినాను- మద్యపానము మఱగి నెగ్గినవాఁడు
ముచ్చునకైనఁ గానఁబడ లేదు. త్రాగుడు దనః సంభవలెఁ గానిపిం
చు రక్కసి- అమృతమువలె లోఁ జొచ్చు హాలాహలము- పరి
మానందముగఁ దోఁచు పాతకము! మొదటిగ్లాసు- కుక్కను జేసి
మొఱిగించును; రెండవగ్లాసు- కోఁతిం జేసి యాడించును; మూఁడ
వగ్లాసు- దున్నం జేసి దుమికించును; నాలుగవగ్లాసు- గాడిదను జేసి
నడిపించును; అయిదవగ్లాసు- పందిం జేసి బురదలో పొరలించును!
మనుజుఁడు మద్యమునకు దాసుఁడు కాఁగానే- పరిజ్ఞానమునకు
సెలవు, పట్టుగల కాటుపిడుపు; సంపదలకు స్వస్తి, సత్సాంగత్యము
నకు సమాప్తి; ప్రేమ కుద్వాసన, పెత్తనమునకు తిలోదకము;
ఎగ్గునకు మంగళము, సిగ్గునకు మూఁకము! మనకథయే యిందు
లకు మంచి నిదర్శనము. మన వివాహము నాఁటికి మహాలక్ష్మి
యింటఁ గాఁపురమాడుచుండెడిది. సార్వకాలమును దినాణము
నందు సంక్రాంతిపండుగవలె నుండెడిది. ప్రజలు మీ సద్గుణము
లను బట్టులవలెఁ బొగడెడివారు. అట్టిస్థితిలో నెట్లో యీయుటుం
బద్యము సోఁకినది! అదిమొదలు క్రమముగా నైశ్వర్య మంతరిం
చినది- పరువు పదలఁ గలిసినది- ప్రతిపత్తి పటాపంచ లైనది-
సౌఖ్యము సన్నగిల్లినది- పరివారము భగ్న మైనది- యెస్టేటు ఎగిరి
పోయినది- చెఱువులంతలేసి మేడలలో మెలఁగిన నాకుఁ జెట్టు
క్రింది కాఁపురము దాపుర మైనది; అఖండాగర్భ శ్రీమంతుల నైప
వినాశ- అన్నమో రామచంద్రా యను నవస్థ చేరు వైనది! అ
దే మట్లున్నారు?-నే నన్నమాటల కాగ్రహము వచ్చి కాదు కదా!

రఘు—ఆగ్రహము వచ్చి కాదు- అనివార్య మైన దుఃఖము వచ్చి!
నిశ్చయముగా నీపలుకులవల్ల నాహృదయము నీ రై పోయినది!
కాని యిల్లు, కాలిన వెనుకఁ బోసిన నీటిపోతవలె నీప్రబోధమంతయు

నరకము! ఏ మందువా?- త్రాగుచు అలవాటుపడినవాని బాధలు త్రాగఁబోవునకే గాని తెలియవు! గడియ తడవైనవో మేను గానుగను బెట్టి యాడుచున్నట్లుండును. నరములు ఛాతీ గోట నిడి నలుగఁగొట్టుచున్నట్లుండును. కీళ్లు సడలును, కాళ్లు తడబడును; పెదవులు బెరడు కట్టును, నాలుక పిడచ కట్టును; కన్నులు కన నేరవు, వీనులు విన నేరవు; పొట్టేఁడు పరాకు, పొట్టేఁడు చిరాకు! కాఁబట్టి,

ఆ. మానవచ్చు తిండి ♦ మానవచ్చును నిద్ర
మానవచ్చు సలిల ♦ పాన మట్లె-
మునుప! యొక్కసారి ♦ మూతి ముంచిన యది
మద్యపాన మింక ♦ మాను టరిది!

ఇంత యేల?-

గీ. విత్త ముపపుటలో వెల ♦ వెలఁదుకకును
మద్యమునకును దారత ♦ మ్యంబు లేదు;
కాని, విత్తము పోఁగానె ♦ గణిక విడుచు
చచ్చునందాఁక మద్యర ♦ సంబు విడదు!

నిర్మ—నిజమే కాని- మన సుండినచో మార్గము దొరకును.
రఘు—మనసు లే కేమి? - మార్గమే కనఁబడకున్నది.
నిర్మ—నేను జెప్పినట్లు విన్నచో- నెలదినములలో మాన్పఁగలను!
రఘు—అట్లయిన, నీమాట కడుగుదాఁటిన నొట్టు!
నిర్మ—(సంతోషముతో) నిజముగానేనా! అమ్మయ్య!- యెన్నాళ్లకెట్టిమాట వింటిని! కస్తూరియింట నిఁకఁ గాలు పెట్టవు గదా?
రఘు—స్వాస్థ్యము దాని స్వాధీనములో నున్నది గదా- కాలు పెట్టకున్న మన కొక గవ్వయైన దక్కునా?
నిర్మ—ఏమి వెఱ్ఱి! దాని చేఁజిక్కినది మరల దక్కుట కుదురునా!

గీ. గోడకు వేసిన సున్నము,
క్షీణము చేఁబెట్టినట్టి ♦ ఫీజు, వలచినో

చేడె కొసంగిన విత్తము,
బూడిదఁ బడు నెటు- మరలఁ ♦ జొందఁగ వశమే !

రఘు—నా యభిప్రాయ మది కాదు- ఏదోవిధముగా నేపాటి యైన సంగ్రహించుకొని వచ్చినచో- ఏ ముద్రాక్షరశాలయో పెట్టుకొని జీవింపవచ్చు నని.

నిర్మ—అమ్మయ్యో ! ఆయింటఁ గాలు పెట్టిన మీ మనసు మరల మాఱిపోక మానదు ! ఆపాటిసొమ్మునకై మీ రచటికి రరుగవలసిన పనియు లేదు. ముత్తా కామరాజునొద్ద మూఁడువేలు వడ్డీకి వేసి నాను. మీ రాసొమ్ము తీసికొని, మీ కిష్టమయిన వ్యాపారమును ప్రారంభింపుఁడు.

రఘు—నా యెడ నీ కాపాటి నమ్మకము కలదా !

నిర్మ—మీ కా సందేహ మేఁదులకు ?- (అని లేచి, పెట్టె తెఱచి, యందలి కాగితమును దీసి) ఇదిగో యిది యతఁడు నాకు వ్రాసి యిచ్చిన నోటు. దీని నిప్పుడే మీకు మార్చెదను. అన్న ట్లింకొకటి- ఈవేసఁగి బెంగుళూరులోఁ గడుపుటకై, యతఁ డీసాయంకాలము రైలులో బయలుదేర నిశ్చయించుకొని- యిందాఁక నె మునిసిపలు వడ్డికూడఁ బంపివేసినాఁడు. కాఁబట్టి, మీ రిప్పుడే వెళ్ళకున్న మన కాసొమ్మింతలోఁ జేతికి రాదు. (అని నోటుపై వ్రాయవలసిన మాటలు వ్రాసి యిచ్చి) చాలునా ?

రఘు—(చదివి చూచి) చాలును. వెళ్ళిరానా ?

నిర్మ—సందియ మేమి? వెళ్ళి, వెంటనే మాత్ర మింటికి రండు. మీరు వచ్చునరికి వంటచేసి సిద్ధముగా నుంచెదను.

రఘు—ఇదిగో- యిప్పుడు రానా ! (అని లేచి, పిలిచబడి పోవుచు) ఇంతటి యిల్లాలి నెంత దుఃఖపెట్టితిని !

గీ. ఎచటనో పుట్టి, తమయిండ్లఁ ♦ కేఁగుదెంచి,
నెమ్మి దైవసములుగఁ జ ♦ త్రము నమ్మి
సేమనిమిత్తము ప్రాతరలు ♦ ధారవోయు
సతుల నేడ్పించు పతులకు ♦ గతులు గలవె !

శర్మ—(ప్రక్కనుండిచతురాలును ప్రవేశించి) ఇదేమి యింతసేపున్నారు?- వెళ్లినపని యైనదా?

రఘు—అయినది కాని- మఱియొకవిధముగా నైనది.

శర్మ—అనఁగా?

రఘు—నా వైఫ్ (Whife) నాకుఁ బరిపూర్ణ ప్రబోధము కలిగించి, నా వెనుకటిచర్యకుఁ బశ్చాత్తాపపడునట్లు చేసినది. ఈ దుర్వ్యసనముల నింతటితో విడిచిపెట్టి, యికమీఁద దాని యిష్టానుసారముగ మెలంగుచు- ఇదివఱకుఁ జేసిన యన్యాయమును తుడిపునకుఁ దెచ్చుటకు నిశ్చయించుకొన్నాను. ఈ సంగతులు నీవు కస్తూరి కెఱిఁగించి, యింకొకదారి చూచుకొమ్మని చెప్పుము.

శర్మ—(తెల్లపోయి) అట్లయిన, మీ రిపు డరుగుచున్న దెచ్చటికి!

రఘు—నా వైఫ్, ముత్తా కామరాజుకడ వడ్డికి వేసిన మూడువేలును. నన్నుఁ దీసికొమ్మన్నందున- ఆసొమ్ముతో నేదేని వ్యాపార మారంభింత మనుతలంపుతో, దానిం దెచ్చుకొనుటకై వెళ్లుచున్నాను.

శర్మ—(తనలో) ఇప్పు డీతనిమాట కడ్డు చెప్పఁ గూడదు. ఆసొమ్ము చేతఁ బడినవెనుక, నిట్టె కుక్కను జేసి యీడ్చుకొని పోఁగలను. (పయికి) బాబు! మీపంథ ఫస్టుక్లాసు (First class) గా నున్నది. ఎల్లకాల మొక్కటేరీతిగా నుండుట యేరికిని మంచిది కాదు. మీరు వెళ్లినప్పుడు కస్తూరియింట నాకుమాత్రమే మేమిపని యున్నది!- మీరు ప్రారంభించు వ్యాపారమునందుఁ దోడుపడుచు, నేనును మీతోనే యుండెదను.

రఘు—అందుల కభ్యంతర మే మున్నది?- అయితే కామరాజును నీ వెఱుఁగుదువా?

శర్మ—ఎఱుఁగ కేమి?- రండు వెళ్లుదము.

(ఇద్దఱుఁ గలిసి నిష్క్రమింతురు)

ఇది యష్టమాంకము.

కస్తూ—ఏమియు లేదు మీ కొక శుభవార్త చెప్పవలె నని.
రఘు—ఏమి టది?
కస్తూ—మీ మామగారు మరణించినా రఁట!
రఘు—ఇదా శుభవార్త?- అవును, మరణించినా రఁట.
కస్తూ—ఆయనయాస్తి యంతయు మీ కూఁతురకు వచ్చిన దఁట.
రఘు—అవును వచ్చిన దఁట. నాఁ డది నాయెడఁ జూపిన యౌదార్యమునకు భగవంతుఁడు దాని కీవిధముగాఁ బ్రత్యక్ష మైనాఁడు.
కస్తూ—అది మీ సామర్థ్యమా- యామె యౌదార్యమా?
రఘు—సరే, యేదియో యొకటి- యెందుల కాసంగతి యిప్పుడు?
కస్తూ—ఎందులకా?- బంగారమువంటి జమీ పంటఁ గలుపుకొని, మీరు విడుచున్న భూములకు నా మనసు క్రుగ్గిపోవుచున్నది! మరల నొకసారి వెళ్లి, మంచిమాటలు రెండు చెప్పి, సగమైన వ్రాయించుకొని వచ్చితిరా- నాసంతాపము తీర్చినవా రగుదురు.
రఘు—ఏమొగము పెట్టుకొని మరల దాని యెదుటి కేఁగమందువు! సిగ్గు విడిచి నేను సిద్ధపడినను- న న్నది మరల నమ్మునా?
కస్తూ—నమ్మునట్లు రవంత నటింపఁ గూడదా?
రఘు—నావల్లఁ గాదు! వెనుకటిదానికే నామనసు వేఁగిపోవుచున్నది!
కస్తూ—అఁటఁ!- అట్లయిన నాయాస్తి యంతయు నేమగునో కాలి యునా?- విశ్వాసఘాతు పర మగును! గిజికిపోచకుఁ గట్టఁబడి యుండుటకు మీ యావిడ కస్తూరి యనుకొంటిరి కాఁబోలును!
రఘు—ఏమిటీ, యెంతమాటాడితివి! ఇదిగో!- యీసంగతి యిఁక నెన్నఁడు నాయెదుటఁ దలపెట్ట కేమి! (అని లేచి చక్కఁబోవును)
కస్తూ—ఈ పీనుఁగు వినునట్లు లేదు!- ఇఁక నేమిటి సాధనము!
శర్మ—సాధనములసంగతి నీ కేల?- సగము కదా నీవు కోరినది- సర్వము నీ స్వాధీనము చేయకున్న- నా పేరు శర్మ కా దనుకో!
కస్తూ—హాయి! హాయి! అదీ మగతనము! ఏదీ యొకము ద్దేదీ!

(అని ముద్దాడుచుండఁగాఁ దెర పడును).

---

# రెండవరంగము

ప్రదేశము:—నిర్మల గది.

నిర్మల—(మంచముపైఁ గూరుచుండి) కటకటా!

గీ. భర్త యేవేశ్య పజ్జనో • పండుకొనఁగ
నింట నొంటిగ శయనించి • కంటఁ గూర్కు-
వెంటఁ దోడును లేక, త • పించుపట్టి
రమణికంటెను నిర్భాగ్య • రాలు కలదె!

ఇంతయాస్తి నాయనగారిచ్చి పోయినందులకు- ఇప్పటికైన నీయన మతి మరలినచో, నిరువుర మెంతేని సుఖపడుదుము గదా! ప్రాణేశ్వరుఁ డట్లు పరాధీనుఁడై చరించునప్పుడు- ఈసంపత్తు నా కేమిసంతోష మిడఁగలదు! (వినుట నభినయించి) రెండు- మూడు- నాలుగు- అయిదు- ఆఱు- ఏడు- ఎనిమిది- తొమ్మిది- పది- పదు నొకండు- పండ్రెండు- అమ్మయ్యో!- అప్పుడే పండ్రెం డయినదే! కనుకనే కాసింత కూర్కు వచ్చుచున్నది! రంగి యెందుచేతనో యీపూఁట రానే లేదు. రంగఁడు మరలఁ దప్పత్రాగి వెళ్లి తల పగులఁగొట్టినాఁ డేమో! పాప మాముండకు ప్రతిదిన గండము కదా! అదృష్టవశమున నా కాయవస్థ మాత్రము లేకపోయినది! ఛీ!

ఆ. కానలోన మొలచు • గాఁ బుట్ట వచ్చును,
నీటికుక్కగా జ • నింప వచ్చు;
పంగ, త్రాగుబోతు • భార్య కాఁ గూడదు
కలను నైన- నాట • కమున నైన!

ఒకవేళ రంగి వచ్చి పిలిచినచో వినిపించుటకై గదితలుపు తెఱచి యుంచెద. (లేచి,దీపము తగ్గించి,పండుకొని నిద్రించును.)

రంగ—(గదితలుపు తెఱచుకొని, తారుచుఁ లోపలఁ బ్రవేశించి) ఓయిదేవుడా! పెరటిగోడ దాటేసరికి పేగు త్రెగాయి! దీని తల్లి కడుపు సల్లగా- యీ తలుపుమాత్తరం దబ్బునే వొచ్చింది! ఆ యెదవసిక్కి నా యెంట బడకపోతే యెప్పుడో రావలసినోణ్ణి!

(ముందునకుఁ జూచి) అదురుట్టం కాఁబోసు- అదుగో- ఆయమ్మ గది తలుపు తెరిచే వుంది! వొచ్చినపని కాగానే, వొక్క నిమిట్లో దాటిపోవడానికి, యీదితలుపు గెడ తప్పించి వుంచుకుంటాను. (అట్లు చేసి, మెల్లఁగా గదగుమ్మము చేరి) యేవి సెప్తా యేనాడూ లేంది కాళ్లొణుకుతున్నాయి! యీరోగాని కిదే మందు. (జేబు లోని బ్రాండిసీసా తీసి, కొంచెము త్రాగి సీసా మరల జేబులో నిడుకొని) అదీ! ఆ సుక్కతో ఆ రోగం వొదిలింది! అగ్గిలో వురకమంటే యీపాలి అమాంతంగా వురకుతాను! (వినుట నభినయించి) అదుగో గురక! మంచి నిద్దర్లో వుంది! మా దొడ్డ సమయం! మెల్లఁగా గదిలోఁ బ్రవేశించి) వెల్తురు సాల్దు- (దీపము పొడగించి, జేబునుండి యొక చిన్న సీసాయు, నొక కాగితపు మడతయుఁ దీసి) ఈ వుత్తరం తలకంద పెట్టి- యీ సీసాలోది కొంత మూతిమీ దెయ్యాలి. (తారుచు మంచముకడ కేగి) కాదు కాదు- ముందు సీసాలోది మూతిమీ దేసి, తరవాతే వుత్తరం తలకింద పెట్ట మన్నాడు. అంచేత, అందాకా యీవుత్తరం విక్కడుంచుతా (కాగితపుమడత మంచముపై[illegible], వెనుక తట్టునకుఁ బోయి, సీసా కార్కు తీసి, వంగి, నిర్మల ముఖమువంకఁ జూచి, యులికిపడి, వడఁకుచు) వోయి బాబో!- నా వొల్ల కాదు! యిల్లాంటి తల్లిని నా సేత్తో నేను సంప లేను! ఆమొహం కంట బడేసరికి- అరికా ల్లేమ నెత్తి కెక్కింది! ఆ యెదవడబ్బు నా కక్కర్లేదు! (సీసాకు మరల కార్కు వేసి, కొంచె మీవలకు వచ్చి) మళ్లీ కాళ్లు వడక పడుతున్నాయి' మనుసు కూడా- మా కంగారుగా వుంది! కాస్త సుక్క తగిత్తే గాని- యీ గాబరా వొదలి, బయట పళ్లేను! (గొంతుక కూర్చుండి, తలకుఁ జుట్టుకొన్న బట్ట తీసు క్రింద నుంచి, జేబులోని బ్రాందిసీసా తీసి, పూర్తిగా నోటఁ బోసికొని, సీసా క్రింద నుంచి, క్షణ మూరకుండి, మైకములోఁబడి యుత్సాహముతో) యేనాడూ లేంది- యీపూ టింత యెదవనై

పొవాన్యా నేం ! ఛీ ! ఛీ ! ఫీగ్గు ! ఫీగ్గు ! అమారాజు- అడిగినప్పుడల్లా- వొకటీ రెండూ యిచ్చూ- యీ కాష్టపనీ పెట్టు కొన్నే- రెం డొండలు రొక్కం చేతి కిచ్చి- రంగానికి కేవు కట్టి, బంగారంలాగు పంపేస్తా నన్నాడు! యెన్నికబుర్లో చె ప్పొచ్చి, యెదవలాగ పక్కా యెత్తే, యేం వంట్రాడు- మొగా న్నౌష్టాడు ! కత్తితో కొట్టడంవా- కత్తితో నరకడంవా ?- మూడు ముక్కలు మూరిమీా దెయ్యాడంనేగా! వో!- యీపా లేపేస్తా ! యెయ్యక పోతే- యిది మీాషం కాదు ! (చిన్నసీసాతో చివాలున లేచి, తప్పటడుగులతో మరల డలవెతుకకు వెళ్లి, వడకుజేతులతో సీసాకార్కు తీసి, వంగి, మెల్లగా సీసా వంచును).

నిర్మ—(మూతిపైఁ బడిన ద్రావకపుఁ జుక్కలవల్ల నిద్ర చెడి, మూలుగుచు చేయి విసరగా, సీసా పోయి దూరమునఁ బడినంతట; నులికిపడి కన్నులు తెఱచి) నాచేతి కిప్పు డేమిటి చెమమా తగిలినది ! (పెదవులు చప్పరించి) నానోటి కేదియో క్రొత్తరుచి వచ్చినదే !

రం— (భయ కంపములతో) వోయి దేవుడా- యేం బుద్ధి! వొక్కముక్కతో పట్టుం దంటే- వొప్పాడు పక్కావొచ్చాను! పానాలేకు- మన్నా లేదు ! నావొంక మూడకముందే నాగుబాంవులాగ పర్గాబోయి-బయట పడితినా బతుకుతాను! నిష్క్రమించును)

నిర్మ—(ఉలికిపడి) ఎవరు వారు !- ఎవరు వారు ! (చివాలున లేచి కూర్చుండి) అమ్మయ్యో ! దొంగ ! (అని మంచము దిగి నిలుచుండి) అదిగో- వీధితలుపు చప్పు డగుచున్నది ! అన్నన్నా ! దాఁటిపోయినాఁడు గదా !...కన్నులు తిరుగుచున్నవి కారణమేమి చెపుమా ! కడుపులో వికారముగఁ గూడ నున్నది!...... నాలుక చిమచిమ లాడుచున్నది- నరములు బిగు వగుచున్నవి ! భయముచేతనా?- నా మనసు నలుసంత కూడఁ జెదర లేదే !... ఆఁ ! తెలిసినది ! ఆ వచ్చిన దొంగ తన యిచ్చవచ్చిన ట్లిల్లంతయుఁ జక్కఁబెట్టుటకై నా కేదో మత్తుమందును బ్రయోగించు

చూచుచుండఁగా- నా కెట్లో ప్రబోధము కలిగినది! ఈ నోటిరుచియు
నీ వికారము దానిదే! అగుఁగాక- కాసింత మగత తప్పఁ- నది
ను తేట చేయఁ గలదు! వీధితలుపునకు గడియ వేసి వచ్చి,
విశ్రాంతిగాఁ బరుండి నిద్రపోయెదను. (నడువఁబోయి తూలి)
కాళ్లు తడబడుచున్నవే! ...కన్నులుకూడ మిరుమిట్లు గొలుపు
చున్నవి!...అంతకంతకు వికారమును నధిక మగుచున్నది!-
ఆ దీపము వేయిదీపములుగా నగపడుచున్నదే! ఈ వికారముతో
వీధిగుమ్మమువఱకును వెళ్లి రాఁగలనా!.....నాలుక పిడుచ
కట్టినది!...పాడుమందు ప్రాణములు తీయదు గదా! కక్కఁగారు
గ్రామమున లేరు- రంగి రాలేదు- ఇప్పు డేమిటి చేయఁదగినది!
ఇట్టి నిశీథ సమయమున నెవరు పలుకుదురు! కట కటా! భర్తృ
యోగము లేని భార్య బ్రతు కింతటిదే గదా! (ఆవేశముతో)
ఓసి- మాయ మద్యరసమా! మా పాలిటి శనిగ్రహమవై- మా
కెట్టి యెడబాటును గలిగించితివే! పుట్టిన వంశమా- పూజ్య
మైనది; చదివిన చదువా- సమగ్ర మైనది; నడచిన నడతా-నాణె
మైనది;- అట్టి నా యనుంగు భర్తనే యిట్టు లధోగతిపాలు
చేయఁ గలిగిన నీ వింక నెవ్వరి నేమి చేయఁ జాలవు! ఏ నేరము
నీవు లేకుండ జరిగినది! ఏ హత్య నీవు లేకుండ సాగినది! ఏ సం
స్థానము నీవు కాలు పెట్టకుండ నెగిరి పోయినది! కడగండ్లు నీ
కొఱకు, కన్నములు నీకొఱకు; అప్రమాణములు నీకొఱకు,
హత్యలు నీకొఱకు; మోసములు నీకొఱకు, వేసములు నీకొఱకు!
ప్రభువు నీ దాసుఁడు, పరిచారకుఁడు నీ దాసుఁడు; పండితుఁడు నీ
దాసుఁడు, పామరుఁడు నీ దాసుఁడు;- నీ యధికార మెంత నిరం
కుశ మైపోయినదే! ఓ ప్రభువులారా! ఓ ప్రజా ప్రతినిధులారా!
ఓ సంఘ సంస్కర్తలారా! ఓ స్వరాజ్యవాదులారా! ఈ మద్య
రసమువల్ల- ఈ మహామారివల్ల- ఈ దుర్వ్యసనమువల్ల- ఈ దుష్ట
జాడ్యమువల్ల- ఈ యగ్నిద్రావకమువల్ల, ఈ హాలాహలమువల్ల-

ఈ పీపావల్ల, ఈ పిశాచమువల్ల- ఎన్నిసంసారములు లేటఁ గలిసి పోవుచున్నవో యెన్నఁడైన గమనించితిరా? కాళ్లు తోడుకొని పోయి, కన్నులు దిగజారిపోయి; వడఁకెడి యవయవములతో, వంకరపోయిన పార్శ్వములతో; క్రుంగిన మూపులతో, క్రుళ్లిన శ్వాసకోశములతో; మనసు చెడి, మతి పోయి- అన్నమో రామ చంద్రా యని యెండ జల్లాడుచున్నారో యెప్పుడైన పరికించితిరా? ఎన్నికొంపలలో దరిద్రదేవత తాండవ మాడుచున్నదో- ఎందఱిభార్యలు లెంతలేసి బాధలు పడుచున్నారో- ఎందఱిబిడ్డలన్నమునకు మొగమువాచి యెంగిలియాకులు నాకుచున్నారో- ఏపాటి నైన పరిశీలించితిరా? ఎందఱి మూలుగులలో, తండ్రులు త్రాగిన మద్యవిషము మజ్జతో మిళితమై, యెంతలేసి రోగములకుఁ గారణ మగుచున్నదో- ఎందఱి పాపిష్ఠి త్రాగుడువల్ల పడుచుతనమునందె- పండి, యెండి; మాడి, మ్రగ్గి- యకాలమృత్యువున కాహార మగుచున్నారో యరసితిరా? ఏఁటేట నెన్నెన్నికోట్లు త్రాగుడుక్రింద దగ్ధ మగుచున్నవో- ఎన్నెన్ని నేరములు, ఎన్నెన్ని హత్యలు త్రాగుడువల్లఁ దిటస్థము లగుచున్నవో పరిగణించితిరా? ఏమి యన్యాయ మిది!- ఎంత విరుద్ధ మిది!...తల్లీ భరతమాతా! తపోనిధులం గన్న నీ వీ త్రాగుబోతుల నెట్లు కనుచుంటి వమ్మా! మానవనిధులం గన్న నీ వీ మధుదాసుల నెట్లు కనుచుంటి వమ్మా! టర్కీ రాజ్యములో త్రాగుడే లేదఁట!- అమెరికాలో మద్యసార మమ్మినవానికిని, కొన్నవానికిని గూడ నాలేసి నెలలు శిక్షయఁట!- ఐర్లండులో త్రాగినవానిని బజారులో జమ చేసి, పట్టణమంతయు నూరేగింతు రఁట! త్రాగుడు ధారాళముగా నొప్పువారి తన్నివారణమునకై యిట్లు పాటుపడుచుండ- మద్యపానము మహాపాతకముగ నెంచు నీబిడ్డలింత మందభాగ్యులైరేమమ్మా! పరమేశ్వరా- తండ్రీ! ప్రభువులు పరార్థకాములు- ప్రజాప్రతినిధులు ప్రసాదకాములు- సంఘసంస్కర్తలు సభావాక్యశూరులు-

స్వరాజ్యవాదులు సహాయులుగానుందురు- అట్టివారివల్ల నీ యంతరంగము హరించుట యసంభవము. మద్యవిక్రయమన: మనుజులకు విషము పోయుట యని యెఱుంగని మా వర్తకులు- బ్రాందిలో కొకేయిను; సారాయిలో నుమ్మెత్త చూర్ణము; కల్లులో కుంకుడు నురుగుఁ గలిపి- ప్రజల ప్రాణములు తీయు మా వర్తకులు- ఈ పాపవ్యాపారమును బరిత్యజింతు రనుట కల్ల! తమ దారిద్ర్యము నకు త్రాగుడే కారణ మని యెఱుంగని మా ప్రజలు- తమ యాయువు త్రాగుడువల్లనే తరిగిపోవుచున్న దని యెఱుంగని.మా ప్రజలు- దినమునకు కోటిరూప్యములు నీసొక్రింద దగ్ధముగుచున్న వని యెఱుంగని మా ప్రజలు-తమ దేశమున కిది గొప్ప తలవంపని యెఱుంగని మా ప్రజలు- ఈ పాపిష్ఠవ్యసనమును బహిష్కరింపఁ గలుగుట యసంగతము! నీ కటాక్షము తప్ప యింక వీడ నిష్క్రామ మగుటకు దారి లేదు! స్వరాజ్యముకొఱకు నే నుద్యమించను- స్వారాజ్యముకొఱకు నిన్ను ప్రార్థింపను- మా దేశమున మద్యపానము లేకుండఁ జేసితివా- మాకు కోటిస్వరాజ్యములుఁ గోటిసామ్రాజ్యములుఁ బ్రసాదించినట్లు భావించెదను! (ఆయాసముతో) అమ్మయ్యా! హామ్మయ్యా! హాఁ! హాఁ! (మోహముతో) ఏమిటి నే నిప్పు డన్న మాట! ఎక్కడికి చెప్పుమా నే నిప్పుడు వెళ్లుచున్నది!... నా యొంటినిండ నల్లులో, చీమలో ప్రాకుచున్నవి!... నా తలవెంత్రుక లెవరో పీకుచున్నారు! నా యొడ లెవరో రక్కుచున్నారు! ...అదుగో నా ప్రాణేశ్వరుండు! అమ్మయ్యా!- వచ్చినారా! ఆఁ! ఆఁ! ఆఁ! అంటకుండు! (అని కాలు చేతులు వెనుకకు వేసి, అంతలో మంచము తగిలి, యట్టె దానిపైఁ గూలఁబడి) అయ్యో! నా గుండెపోవుచున్నది!...అబ్బా! దాహము! దాహము! హా! పరమేశ్వరా! (అని వెనుకకుఁ బడి) పరమేశ్వరా! హా! హా!

తెర పడును.

ఇది సప్తమాంకము.




# దశమాంకము

## మొదటి రంగము

ప్రదేశము:—పోలీసుస్టేషను.

ఇనస్పెక్టరు—(ఆయాసముతోఁ బ్రవేశించి) అబ్బా! యేమి యవస్థ!- యేమి బ్రతుకు! పోలీసు నవుకరీకంటె- పొగచుట్టల దుకాణము మంచిది! నిర్మలాంబను రఘునాధరావుగారే చంపి యుందు రను నిశ్చయాభిప్రాయముతో, దొరగా రాయనను తోడనే యరెస్టు చేయించి- సాక్ష్యము సమకూర్పు మని నన్ను పంపివేయుచున్నాఁడు! సాక్ష్య మంత చౌకగా దొరకునా! విశ్వనరావుగారు వచ్చినఁ గొంత చిక్కు విడవచ్చు నని యున్నది- యింతవఱ కాయన రానే లేదు! ఇప్పు డేమిటి చేయఁ దగినది ?- (అని బల్లకడఁ గూర్చుండి, యేవో కాగితములు తీసి చూచును).

విశ్వా—(ప్రవేశించి) విధివిధాన మెంత విపరీత మయినది!

సీ. పరిపూత చరితుండై • పరఁగు వాఁ డిటు మద్య
పానంబునకుఁ బాలు • పడుట యేమి!
సతతంబు విబుధసం • గతి నొప్పువాఁ డిటు
తులువలతోఁ జెల్మి • సలుపు టేమి!
పరకాంత లెన్న డైనఁ • బెడ కేగువాఁ డిటు
వారకాంత గృహంబు • పట్టు టేమి!
తొరఁగు సిరులతోఁ • దులఁదూఁగువాఁ డిటు
తలమించు ఋణములఁ • దగులు టేమి!

అట్టి సంస్థానమును దెగ • నమ్ముకొనుటేమి!
నినసేనిం జంప నను ఘోర • నింద దోషమేమి!
కాలి సంకెళ్లతోం జెఱ • సాల యేమి!
కట్ట! యిది యెల్ల విధిచేష్టితంబు కాక యేమి! (పరిక్రమించును)

ఇన—(తలయెత్తి చూచి) ఇదిగో!- యెప్పుడు వచ్చినారు! ఇప్పుడే మీమాట యనుకొన్నాను! కూర్చుండుడు! ఇన్నాళ్లు చేసినా రేమి?

విశ్వా—(కూర్చుండి) నిలుకడగా నే నొకచోట నిలువక పోవుటచే, నిన్నటి యుదయమునకు మావారి యుత్తరములు నా కందినవి కావు. సంగతి తెలియంగానే, సాపాటుకూడ చేయకుండ బయలుదేరి- రాత్రి పదిగంటల కింటికి వచ్చినాను.

ఇన—రాత్రియే వచ్చినారా? రాంగానే నన్నేలం గలిసికొనలేదు?

విశ్వా—ముందు రఘునాథరావుగారితో ముచ్చటించువఱకు నీ వ్యవహారమునందుం బ్రవేశించుట కిష్టము లేక- అరుణోదయము కాంగానే చెఱసాలకు వెళ్లి, ఆయనతో మాటాడి- యిటు వచ్చినాను.

ఇన—అలాగుననా?- అట్లయిన నేదో విశేష ముండవలెను.

విశ్వా—ఆయన నిర్దోషి- అదియే విశేషము.

ఇన—అని మీ రెట్లు చెప్పంగలరు?

విశ్వా—అట్టి దృఢవిశ్వాస మాయన నాకుం గలుగంజేసినారు.

ఇన—మాటలచేతనా- నిదర్శనముల చేతనా?

విశ్వా—మీ రేమి నిదర్శనములనుబట్టి యాయన నరెస్టు చేసినారు?

ఇన—ఆమె మరణమువలన లబ్ధిని బొందువాం డాయన. ఆయన యిప్పు డర్థకాముం డై యున్నాడు. అందువలన, నిది, యాయన పనియె యని యభిప్రాయపడవలసి వచ్చినది.

విశ్వా—ఆత్మహత్య చేసికొనం దలంచిన ట్లామె స్వయముగా వ్రాసిన యుత్తర మొకటి యామె శయ్యపై దొరకిన దంటగా?

ఇన—దొరికినది. తమపై ననుమానము కలుగకుండుటకై దానిని రఘునాథరావుగారే కల్పించినా రని మాదొరగారి యభిప్రాయము.

విశ్వా—మీ యభిప్రాయము ?

ఇన—ఆమె యాత్మహత్య చేసికొనియుండు ననియే నా యభిప్రాయము.

విశ్వా—అట్లయిన మీయభిప్రాయముకూడ సరియైనది కా దనియే నా యభిప్రాయము. అయిన నా యుత్తర మేదీ చూతము.

ఇన—ఇదిగో-ఇచ్చటనే యున్నది.(అని యుత్తరము తీసి యిచ్చును).

విశ్వా—(విప్పి చూచి, యులికిపాటుతో) ఇదిగో !- యీశ్వరవిలాస మనఁగా నిది! ఈ యుత్తరము నిర్మలాంబ వ్రాసినది కా దనియే కాక- యెవరు వ్రాసినదో కూడఁ దెలిసిపోయినది !

ఇన—(ఆశ్చర్యముతో) ఏమిటీ !- ఎవరు- ఎవ రా వ్రాసినవారు !

విశ్వా—ఇం కెవరు- కస్తూరి ! దానియుత్తరములు నాకడ త్రొక్కి యున్నవి. సంగతులుకూడఁ జదివి చూతము- "నాభర్త వేశ్యాలోలుఁడై నన్ను విడిచిపెట్టుటచేత, నా జీవితముపై నసంహ్యాము పుట్టి, ఆత్మహత్య చేసికొనుటకు సంకలిపించితిని. నా చావునకు నేనే భాద్యురాలను- నిర్మల." (అని పఠించి) చిత్తగించినారా ?- "అసహ్యము" అనుటకు- "అసంహ్యాము" అనియు- "సంకల్పించితి" ననుటకు- "సంకలిపించితి" ననియు- "బాధ్యురాల" ననుటకు- "భాద్యురాల" ననియు- నిర్మలాంబ నిద్దురలోఁ గూడ వ్రాయదు. కాఁబట్టి, యివి కస్తూరి వ్రాసినవే యని నేను గట్టిగాఁ జెప్పఁగలను.

ఇన—ఉద్దేశము ?

విశ్వా—ఉద్దేశమునకు మన యూహా లవసరము లేదు. నిర్మలాంబ కళచేత నిర్మలపంతముఁ జూపి, సగ మాస్తి యైన వ్రాయించుకొని ర మ్మని శేషాద్రియుఁ, గస్తూరియు శతవిధముల పోరినట్లును- ఆమె నిరాకరించినట్లును- రఘునాథరావుగారు చెప్పుచున్నారు-

ఇన—సరే, సరే- సంగతి యిప్పుడు బోధపడినది ! ఆమెను గడతేర్చినచో, ఆస్తియంతయు రఘునాథరావుగారి పరమగు ననియు, అప్పుడు దా మిట్టి యనుభవించుకొనవచ్చు ననియు నుద్దేశించినారు

పోలీసు వారిని పోరపెట్టుటకై యీ యుత్తరమును కల్పించి- యీ పనిచేసి యుందురు. అసలుమునందుం గానవచ్చిన యడుగుల గుర్తులనుబట్టి, మాయింటం బురుషుం డెవ్వండో ప్రవేశించి నట్లు కూడ స్పష్టపడుచున్నది. అందువల్ల నా ప్రవేశించినవాండు శర్మ కానలెను. అయితే, అతం డంత సాహసము చేయంగలండా!

విశ్వా—ఆసంగతి యాలోచింతము. అందుచట దొరకిన వేమేమిటి?

ఇన—ఒక ఖాళీ విషపు సీసా, యొక బ్రాండీ సీసా, యొక యుత్తరీయము.

విశ్వా—ఆ యుత్తరీయ మేదీ?

ఇన—గుర్తుపట్టించుటనిమిత్తము చాకలి గూడెమునకుం బంపినాను. అడుగో- అతండును వచ్చినాండు. ఏమి జగ్గప్పా! యేమైన తెలిసెనా?

జగ్గ—(ప్రవేశించి విశ్వాసరావును జూచి వెనుకకు తగ్గును.)

ఇన—సందేహ మక్కఱ లేదు-చెప్పవచ్చును-ఎవ్వరైన గుర్తించినారా?

జగ్గ—నీరిచాకలి చూచి- మా పంతులుగారి దని చెప్పాడండి.

విశ్వా—మా చాకలి నా దని చెప్పినాండా!- ఏదా యుత్తరీయము?

జగ్గ—(చంకలోని మడత తీసి బల్లపై నుంచును).

విశ్వా—(విప్పిచూచి) హాయి! హాయి! దొరకిపోయినాండు దొంగ!

ఇన—(జగ్గప్పతో) సరే వెళ్లుము. (అతండు పోంగానే) ఎవం డెవండు?

విశ్వా—ఇం కెవండు!- మా యింటిచుట్టమే! రంగండు! వీనిభార్య మొన్నటివఱకును మాయింటం బరిచారికగా నుండెడిది. దాని యెడ నాకుంగల నమ్మకమునుబట్టి యీమధ్య దానిని నిర్మలాంబ కడ నుంచినాను. ఆరాత్రి యది పండుకొనుటకు వెళ్లలే దని తెలిసి- కారణ మే మని యడుగ- తమ్మునరములో నున్న తన తల్లికిం బ్రాణముమీందికి వచ్చినట్లు చెప్పంగా, తా నా రాత్రి యచటికి వెల్లినట్లును- తల్లి సుఖముగానే యున్నందున మఱునాండే వచ్చివేసినట్లును- జెప్పినది. దాని కా కల్లవార్త చెప్పినవా డెవండో తెలిసినదా?- రంగండు!

ఇన—అలాగునా! అయితే- యుత్తరీయమునంగతి యేమిటి?

విశ్వా—అన్నట్లు సంగతి చెప్ప లేదు. ఈ యుత్తరీయము నాదే.
ఈ పోలీసుం డొకనాడు వచ్చి ప్రాకులాడ- నేనె యిచ్చినాను.

ఇన—అట్లయిన నీకు సందేహ మక్కఱలేదు- అతఁడే హంతకుఁడు.
వాఁడు శర్మవెంటఁ దిరుగుచుండఁగా వంటసాములు చూచినారు.
ఆదిగాక- యాయింటఁ బ్రవేశించినవాని యడుగులగుర్తులు నోటు
చేసినాము. రంగని గుర్తులు మాయొద్ద నిదివఱకే యున్నవి.
రెంటిని బోల్చి చూచిన సంగతి క్షణములోఁ దేలఁ గలదు. శర్మ
వానిని సంధించి యుండును. శర్మపై నిందులకు సాక్ష్యము సంపా
దింపవలెను. అన్నట్లొక సంగతి చెప్ప లేదు- విషపు సీసామీఁద
"స్మిత్ అండ్ కో, మద్రాస్" అని యుండుటచేఁ- బ్రత్యేక
మొకనిని వారికడకుఁ బంపినాము. అతఁడీపూఁట తప్పక రావలెను.

విశ్వా—చాల చక్కనిపని చేసినారు. ఎప్పుడు మీ వాయిదా ?

ఇన—ఎప్పుడోనా? రేపే! ఈ పూఁట మీరు రాకపోయినచో- రంగని
పిడుగు రఘునాథరావుగారిని గొట్టుకొని పోవలసినదే!

విశ్వా—సాక్ష్య మేదీ ?

ఇన—పోలీసువారికి సాక్ష్యలోపమును- పోలేరమ్మకు నైవేద్యలోపము
నా! అన్నట్లు, పాప!- మాయన యెట్లున్నారో చెప్పలేదు.

విశ్వా—చెప్పుట కేమున్నది- ఈ పదునైదు దినములలోఁ బదునై
దేండ్ల మార్పు కలిగినది! వెనుకటి వ్యసనము లన్నియు వేళ్లతోఁ
గూడ హరించినవి! భార్యకొఱ కాయన పడుచున్న పరితాపము
చూచిన పాషాణములుకూడ నీరగును! ముందుసంగతి యేమిటి?

ఇన—చెప్పనా ? ఈపూఁట శర్మను, కస్తూరిని, రంగని అరెస్టు చేసె
దము- ఈరాత్రి మాముదుపులు మేము వదులుకొనెదము.. క్రొత్త
ఛార్జిషీటుతో రేపు కోర్టులో నిలిపెదము.

విశ్వా—అట్లయిన, నే నింటి కేగి భోజనము చేసి అఱగంటలో వచ్చెద.

(అని లేచుచుండఁగా తెర పడును.)

---

# రెండవ రంగము

ప్రదేశము:—మేజిస్ట్రేటు కచేరి.

ప్రవేశము:—న్యాయపీఠమున మేజిస్ట్రేటు—ఎదుట నొకప్రక్క కుర్చీలో ప్రాసిక్యూటరు—రెండవప్రక్క పంతులు, (రఘునాధరావుగారి వకీలు) వారయ్యను, (కస్తూరి శర్మల బారిష్టరు) విశ్వాసరావు— వెనక జేరము— దూరమున బోనులో— రఘునాధరావుగారు, శర్మ, కస్తూరి. రంగఁడు.

మే:—ఆల్ రైట్! ఇక మీ యార్గ్యుమెంట్సు కానీయవచ్చును.

ప్రాసి—(లేచి) సిత్తం, సిత్తం. ఈ కేసులో నేను నిండా శప్పేదే విన్నా. ముద్దాయీలమేల యెవిడెన్సు పూరాగా ప్రూవైన వుండే సమాచారం కోర్టువారికిదా తట్టే వుండవలా. వృస్టో. క్రైమ్ నడిచిన పోట్లో చిక్కిన సీసా మేల "ప్రస్సిక్ ఆసిడ్, పాయిజన్, స్మిత్ అండ్ కో, మెడ్రాస్" అని వుండింది. ఆయమ్మ చచ్చుకసింది ప్రస్సిక్ ఆసిడ్ మూలంగాదానాని, యెగ్జామిన్ చేసిన డాక్టరు సర్టిఫై చేసివుండె. స్మిత్ అండ్ కో యేజెంటు— శకంను ముద్దాయి శర్మ— ప్రస్సిక్ ఆసిడ్ పంపేదిగా తమరికి లెటర్ రాశింది— తమరు పోస్టుగుండా దాన్ని డిశ్పాచ్చి చేసిందీ— చెప్పిందే కాక— శర్మ లెటరూ, వారి డిశ్పాచ్ బుక్కూ— కోర్టులో దాఖల్ చేసిదా వుండె. శర్మ రైటింగుతో కంపేర్ పెడితే— ఆ లెటర శర్మ రాశిందిగాదానా నిచ్చితం వడింది. ఆ యాసిడ్ పార్సిల్ శర్మవాడుగా యెత్తుకొనింది— పోస్టుప్యూన్ సాచ్చెంవోల్లె ప్రూవు కాపడింది. ఇందుల్నిపట్టి, అయమ్మ చచ్చుకునింది ప్రస్సిక్ ఆసిడ్ వోల్లానీ— దాన్ని రప్పించింది శర్మవాడనీ ప్లెయిన్‌గా తెలిశయింది. క్రైమ్ నడిచినపోట్లో కానవొచ్చిన ఫ్లూట్— రంగఁడువాడి దని విస్వాసరావువారి యెవిడెన్సువోల్లె ప్రూవయింది. ఆదినం రాత్రి, టూవోక్లాక్ యాళ, రంగఁడువాడు, దీ సేమ్ స్ట్రీట్‌కుండా, సైమేల బట్ట లేంకి, జల్దిగ పూంగుస్తాన్న సమాచారం

లేదు. కాలకర్మవశమున గస్తూరి సంబంధము కలిగినను- భార్య యెడ నాయన ప్రతికూలబుద్ధి కలవారు కారు. ఆయనకు ఘన మగు నవసరమైనపుడో నామె సహాయము తీసుకొనగలరు. ఆయన యడిగినచో నామె యిష్టు చెప్పనదియుఁ గాదు. లోగడ నొకసారి యామె తనయొద్దనున్న మూడువేల రూపాయల నాయన యడుగకుండనే యిచ్చినట్లు విశ్వాసరావుగారు చెప్పియున్నారు. ఇట్టి స్థితిలో, నట్టియిల్లాలి నాయన చంపించినా రనుటకంటె నసంగత మగునొకటి యుండదు! ఆమె తండ్రిగారివల్ల నామెకు వచ్చిన యాస్తి నెట్లయిన వ్రాయించుకొని రావలసిన దని శర్మయుఁ, గస్తూరియు రఘునాథరావుగారిని సర్వవిధముల వేధించినట్లును, ఆయన నిరాకరించినట్లును విశ్వాసరావుగారి సాక్ష్యమువల్ల విస్పష్టముగాఁ దెలియుచున్నది. ఆయనద్వారా తమయూటలు సాగకపోవుటచే- నామెను గడతేర్చినచో నయ్యాస్తి కాయన హక్కుదారు లగుదు రనియు, నప్పుడు దా మూపాటేలము కట్టవచ్చు ననియు నూహించి, శర్మయుఁ గస్తూరియుఁ గలిసి, సాహసికుఁడైన రంగనిచే నీహత్య జరిపించినట్లు స్పష్టపడుచున్నది. కాఁబట్టి, ఘనతవహించిన కోర్టువారు, దోషరహితులైన మా ముద్దాయిగారిని తోడనె విడుదల చేయఁగోరుచున్నాను. (కూర్చుండును.)

మేజి—(ఏమో వ్రాసికొనును)

వెంక—(మెల్లఁగా) బారిష్టరు బావమ్మరిదీ! పీజుకోసం ఆలోచించక బింకంగా పని చేయ్యాలి సుమండి! పాతస్నేహం పరాకుపడొద్దని మాయక్కయ్య మీతో మరీమరీ చెప్పమంది.

నాయు—(మెల్లఁగా) సాక్షుల నెల్లా సాగదీశానో చూశావా? ఆర్గ్యుమెంటులో మేజిస్ట్రేటుగారి నెల్లా పడగొట్టేస్తానో చూడు! ఒకవేళ కన్విక్ట్ చేస్తా డనుకో- సెషన్సుకోర్టులో జూరీలమీద పడేస్తాను! అక్కడా కాకపోతే- అపీల్లో అదొనిమిషం పని!

మేజి—ఏమి నాయుఁడుగారు! మీ రేమి చెప్పెదరు?

నాయ—(లేచి) ఆ సాక్ష్యా! ప్రాసిక్యూటరుగారూ, సాక్షులుగారూ చెప్పినదానిలో పాయింటు నిల్వదు. సాక్షులు చెప్పిన మాటల్లో సంబంధం సైఫరండి. పోలీసువారు మొదట, మొదటి ముద్దాయినిమాత్రమే అరెస్టు చేశారు. మిగతవారిని అక్రమంగా నిన్న సాయంకాలం చేశారు. ఇది క్రిమినల్ ప్రొసీజరుకు కేవలం విరుద్ధం. (బల్ల గుద్దుచు) ఈ వొక్క పాయింటుమీదనే యీ కేసు త్రోసివెయ్యబడవలసి వుంది. స్మిత్ అండ్ కో వారి యేజంటు దాఖలుచేసిన వుత్తరం శర్మగారు వ్రాసింది కాదని నేను స్పష్టంగా చెప్పగలను. శర్మగారి దస్తూరీకిన్నీ దానికిన్నీ సంబంధమే లేదు. శర్మగారు దాన్ని వ్రాస్తుండగా చూచిన సాక్ష్యం అసలే లేదు. అందువల్ల, ఆవుత్తరం ఆయన పేరుపెట్టి యితర్లు వ్రాసిందిగా అవశ్యం నమ్మవలసివుంది. అదిగాక శర్మగారు ఎల్. ఎమ్. పీ. ప్యాసయినవారు. అటువంటివారిటువంటిపనికి అంగీకరిస్తారనడం అన్యాయం! నిర్మలాంబ మంచంమీద దొరికిన లెటరు కస్తూరి వ్రాసిందనడానికి కారణాలేమీ లేవు. దాన్ని కస్తూరి వ్రాస్తుండగా చూచినసాక్ష్యం లేదు. కస్తూరి యుత్తరాలని విశ్వనాథరావుగారు దాఖలుచేసిన కాగితాలన్నీ కల్పితాలు. పోలీసువారూ విశ్వనాథరావుగారూ కలిసి యీ ఫోర్జరీ చేసివుంటారు-

ప్రాసి—(లేచి) ఐ రిక్వెస్టు దీ కోర్టు టు నోట్ దట్ వర్డింగ్!

నాయ—ఓ–నేను ముద్దాయీల ప్లీడర్ని–నాయిష్టంవచ్చినట్లు మాట్లాడడానికి నాకు కావలసినంత అధికారం వుంది. కావలిస్తే కలెక్టరు ట్వెంటీ సెసెస్ నోటుచేసుకోండి!

మేజి—నో ఆర్డర్! నో ఆర్డర్! డోంట్ వేస్టు మై టయిమ్!

నాయ—చిత్తం–చిత్తం. కస్తూరి చక్కదనంలోనూ సంగీతంలోనూ కూడా చాలా పేరుపడ్డ మనిషి. అది గజ్జెకట్టిం దంటే అన్నపానాలు మానేసి కూర్చుంటారు. సొమ్ములతిరిగినవారంతా దాని కొంపచుట్టూరా తిరగడం నేను స్వయంగా యెరుగుదును. దానికి

ధనమే కావలిస్తే కొంపలూ గోళ్లూ తెగనమ్మి తెచ్చి యిచ్చేవాళ్లు కోటి మంది వున్నారు. ఈ నాస్తి కోసం దాని కింతపని చెయ్యవలసిన యవసరం యేమీ లేదు. ఇక సాక్షుల సంగతి చూతాం. ఈ కేసులో ఆబ్జెక్టైన సాక్షులు ఆరుగురు. స్మిత్ అండ్ కో వారి యేజంటు సాక్ష్యం చిల్లిగవ్వకు కొరగాదు. పోస్టు జవాను శర్మగారి కాపార్శిలు ఏ డేటున డెలివరి చేసిందీ చెప్పలేకపోయాడు. పార్శిలుమీద స్మిత్ అండు కో వారి పేరున్న దంటాడు. ఆ పేరు తా నెందుకు చదివాడో- డేటు మరిచిపోయినవాడు పే రెందుకు మరిచిపో లేదో కోర్టువారు ఆలోచించవలసి వుంటుంది. ఆ పార్శిలులో వున్నది ప్రుస్సిక్ ఆసిడ్డని అసలే చెప్పలేక పోయాడు. కాబట్టి, యీసాక్ష్యానికి గడ్డిపరక పాటి విలువ లేదు. రంగి, తన మొగుడు తనకు ఫాల్సు యిన్ఫర్ మేషన్ చెప్పి తన్ను నిర్మలాంబ గారి యింట పండుకోవడానికి వెళ్లకుండా చేసినట్టు చెప్పింది. ఇది కేవలం విరుద్ధం. నిజంగా మొగుడల్లా చెప్పినా- నిశ్చయంగా కోర్టు వారియెదుట యేపెళ్లామూ ఆసంగతి వప్పుకోదు. కాబట్టి, యిది కల్పనసాక్ష్య మన్నమాట స్పష్టం. ఇక్కడికి ముగ్గురైనారు. కడమ ముగ్గుర్లో ఇద్దరు పోలీసు జవానులు. పోలీసువారి సాక్ష్యాని కెంత విలువ యివ్వాలో కోర్టువారికి విశదమయ్యే వుంటుంది. రాత్రి రెండు గంటలవేళ రంగిన్ని చూచా నంటాడు! రాత్రి రెండు గంటలవరకూ బీటులో మేలుకున్న కానిస్టేబిలును నే నిదివరకు చూడ లేదు! ఆరాత్రి రంగిడు కట్టుకున్నది తెల్లపంచని రంగి చెప్పింది- యెఱ్ఱపంచంటాడు కానిస్టేబిలు. కాబట్టి, వీళ్లసాక్ష్యం కంగాళీసాక్ష్యం అని చెప్పక తప్పదు. ఇక విశ్వానరావుగా రున్నారు. ఈ నాటకాని కీయనే నాయకుడు. ఇదే కోర్టువారు ముఖ్యంగా వినవలసిన సంగతి. ఈయన కస్తూరిని కామించినందులకై రఘునాథరావుగారీయన్ని డిస్మిస్ చేసి, ఆవుద్యోగం శర్మగారి కిచ్చారు. ఈ కారణంచేత కస్తూరిమీదా, శర్మమీదా, కార్పణ్యం

సహించి, కసి తీర్చుకొనే నిమిత్తం శర్మగారి పేరుతో స్మిత్ అండ్ కో వారి ఉత్తరం వ్రాసి, ప్రెస్సిక్ ఆఫీస్ తెప్పించి, పోష్టుజవాన్ని కట్టి శర్మగారికి తెలియకుండా తనకు డిలివరీ చేయించుకుని, దాన్ని ప్రయోగించడానికి రంగన్న ద్వారా యేర్పాటు చేసి, తనమీద అనుమానం తగలకుండా పోయేనిమిత్తం పొరుగూరు చక్కాబోయి, పనిజరిగినట్టు తెలిసినతరువాత పరస్పరంగా మొదట్రాత్రి చక్కావచ్చి, నిన్న పోలీసువార్ని కట్టి నిష్కారణంగా కస్తూర్నీ, శర్మగార్నీ అరెస్టు చేయించారు. రంగడికి తాము కంపెనీ, ఇచ్చినట్టూ, రంగి తమయింట్లో చాలా కాలం పని చేసినట్టూ ఆయనే నప్పుకున్నారు. అందువల్లనే, ఆయిద్దర్నీ, గ్రామ్యవ్యవహారంలో యిట్టే పనిముట్టుగా చేసుకోగలిగారు. ఆ యింట్లో దొరికిన పుస్తకమున్నూ, దాన్ని ప్రూవు చేయడంకోసం దాఖలుచేసిన యితర పత్రాలున్నూ, ఆయన సృష్టించినవే. కాబట్టి, కోర్టువారు ఈసంగతులన్నీ గమనించి, మా ముద్దాయిలిద్దర్నీ విడుదల చేయించాలనిన్నూ, విశ్వాసరావుగారిపై తగుచర్య జరిపించుటకున్నూ కోరుతున్నాను.

మేజి—రఘునాథరావుగారూ! మీరు నేరము చేసినారా?...పలుకరేమి? ఉమ్ములనే!-మీరు నేరము చేసినారా?

రఘు—(పిచ్చివానివలె) నేనా?-నేరమా!-యేమి నేరము చేస్తినమ్మా!-ఆఁ! అర్థమైనది! అయ్యా! నే నేరము చేయలేదు!

మే—(వ్రాసుకొని) శర్మగారు! మీరో?

రఘు—అయ్యా! నేను చెప్పదలచినది సెషన్సులోఁ జెప్పుకొనెదను.

మే—ఆల్ రైట్! (కస్తూరివంకఁ జూచి) నీవో?

కస్తూ—అయ్యా! సత్యము చెప్పెదను. మహాప్రభువులు మన్నించి, సాక్షిక్రిందఁ దీసికొందు రని పోలీసువారు చాలదూరము చెప్పినందున యథార్థము గుప్తపరచుకొనుచున్నాను. ఆయుత్తరము వ్రాసినదే. అందుది వ్రాసినదిఁ గాని, కూడునది వ్రాసిన... శర్మగారు నన్ను చాల బలవంతపెట్టి వ్రాయించినారు.

విశ్వా—బాబు! కడచినదానిని మఱచి కర్తవ్య మాలోచింపుఁడు.

రఘు—ఆలోచన కే మున్నది- ఆమె యా స్త్రీయు, నాజీవితమును గూడ మద్యపాన నివారణమునకై వినియోగించి- పరలోకమునం దైన నామె యాత్మకు పరిపూర్ణశాంతి కలుగఁజేసెద.

విశ్వా—అట్లయిన, నాజీవితముకూడ నా యుద్యమమునందే కడపెద. ఈపూఁటకు మంగళాశాసనము కావించి, యింటి కేగుదము.

సీ. దేశంబు నానాఁట ♦ నాశంబుఁ గావించు
మద్యపానము రూపు ♦ మాయుఁ గాక!
పేదసాదల నెల్లఁ ♦ బీల్చి పిప్పి యొనర్చు
కల్లంగడులు నేలఁ ♦ గలియుఁ గాక!
సంసారులను ముష్టి ♦ సన్న్యాసులం జేయు
రమ్ముకొట్లను దుమ్ము ♦ రాలుఁ గాక!
సంస్థానములను శ్మ ♦ శానంబులం జేయు
బ్రాందిషాపులు మూలఁ ♦ బడెనుఁ గాక!

విధిగ నేఁటేట నీ పాడు ♦ విషపునీళ్ల
కొఱకు వ్యయ మగు కోట్లను ♦ కోట్లు, దేశ
మునకు దక్కి- దరిద్రము ♦ ముదుకకూడు
ముకుళగుడ్డల నేని పొం ♦ దుదురు గాక!

శ్రీమజ్జగద్గురు శంకరభగవత్పాద ప్రసాదాసాదిత మహాకవిబిరుదాంక
భారద్వాజ గోత్రార్ణవ శశాంక, కవిఘంటా కలాప హస్త
కాళ్లకూర్యన్వయ ప్రశస్త, బంగారురాజ కవిరాజ
తనూజ, నారాయణరాయామాత్య బిడౌజ
ప్రణీతంబగు మధుసేవా ప్రకరణము

సంపూర్ణము.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B102 |
| పుస్తకం పేరు | మధు సేవ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 103 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 13TO16,70,71 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Sumitha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |